# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

**Monday, the 22nd February, 1954.**

The House met in the Assembly Chamber, Kurnool, at eleven of the clock, Mr. Speaker (the Hon. Sri N. Venkatramaiya) in the Chair.

## I. QUESTIONS AND ANSWERS.

### Starred Questions.

*Regularisation of services of 9 (a) (i) candidates.*

* 114 Q.—Sri K. Krishna Rao:—Will the Hon. the Chief Minister be pleased to state—

After the examinations, interviews etc., 1950, 1951 and 1952 for the regularisation of services of 9 (a) (i) candidates in Government service held by the Public Service Commission both in the case of clerks and officers, the number of such candidates, i.e., officers, and clerks that were :

(1) confirmed as clerks and officers in regular Government service;

(2) declared by the Service Commission to be fit for confirmation, but were not confirmed or their period of probation is declared either begun or ended ; and

(3) declared by the Service Commission to be fit for confirmation, but whose services were terminated with effect from 1-10-1953?

The Hon. Sri T. Prakasam :—Presumably, the hon. Member desires to know how many of the temporary clerks etc., selected by the Commission in 1950, 1951 and 1952

(1) were regularly appointed in Government service ;

(2) were not regularly appointed ; and

(3) were discharged from service with effect from 1-10-1953.

The question relates to a period anterior to the date of formation of the Andhra State. Also the information asked for has to be collected and furnished to this State by the residuary Madras State. The time and labour involved

in collecting the information will not be commensurate with the public interest served thereby.

The commission declares candidates as fit for regular appointment and not for confirmation as presumed in the question. Confirmation is made by the appointing authority.

Sri. K. Krishnarao :— 9(a)(1) candidates ను regularise చేయడానికి పరీక్షలు పెట్టారు. ఆ పరీక్షలలో [illegible]టువంటివారిని, ఆంధ్రగవర్నమెంటులో పనిచేస్తున్నటువంటివారిని 1-10-1953 తరువాత ఎంతమందిని discharge చేశారని అడుగుచున్నాను. ఇది composite stateకు సంబంధములేదు. ఆంధ్ర గవర్నమెంటులో పనిచేస్తున్నటువంటి వారు 1-10-1953 తరువాత ఎంతమంది యొక్క సర్వీసులు terminate చేయబడినాయని అడుగుచున్నాను.

The Hon. Sri T. Prakasam :— A separate question may be put.

Sri R. Siddanna Gowd :—అధ్యక్షా, Services commission candidates ను మొట్టమొదట సెలెక్ట్ చేసేటప్పుడు, [illegible] ఏ basis పైన జిల్లాలవారిగా select చేస్తున్నారు?

Mr. Speaker :— This question need not be answered. This cannot be answered easily.

*Committee to advise Sri Trivedi in the formation of the Andhra Province.*

* 115. Q :— Sri T. Lakshminarayana Reddy :—Will the Hon. the Deputy Chief Minister be pleased to state the reasons for not including members belonging to other than Congress, Praja Socialist and Krishakar Lok Parties to advise Sri Trivedi in the formation of Andhra Province?

The Hon. Sri N. Sanjeeva Reddi :—This Government have no information on the point why representatives of certain political parties have not been included in the Committee.

ఈ విషయములో ఈ ప్రభుత్వానికి ఏమీ information లేదు.

Sri T. Lakshminarayana Reddi :— ఈ ప్రభుత్వానికి సంబంధము లేదనుకోండి. అయినప్పటికీ అప్పటి ప్రభుత్వములో ఒక కమ్యూనిష్టు పార్టీయు, ఇంకనూ కాంగ్రెసు పార్టీతో సంబంధముగల ఇతర పార్టీల

22nd February 1954]

వారు గూడా ఉండినారు. అటు వారు కూడ ఆ కమిటీలో ఉండినట్లైన త్రివేదీగారికి మంచి సలహాలివ్వడంలో తోడ్పడి యుందురు. కాబట్టి, ఇక ముందు కైనా, ఇటువంటి ముఖ్యమైన విషయాలలో ఇతర పార్టీలను గూడ నియమించడానికి ప్రభుత్వము ప్రయత్నిస్తుందా.

The Hon. Sri N. Sanjeeva Reddi :— ఈ కమిటీని ఈ ప్రభుత్వమునియమించలేదు. దీనిని నియమించే విషయములో ఈ ప్రభుత్వము వారికి ఏమిహక్కు లేదు.

Sri Vavilala Gopalakrishnayya:—ఈ కమిటీనిఎవరు వేశారని సెంట్రల్ cabinet ను నేను అడిగితే మేము వేయలేదని చెప్పారు. అది మద్రాసు గవర్నమెంటు వేసిందని చెప్పారు. అందువల్ల దీనిని మద్రాసు గవర్నమెంటు వేసినప్పుడు ఈ గవర్నమెంటు తరఫున, వెళ్ళినటువంటి వారు ఇంకా గీనికి ఇతర పార్టీల representation రావలసి యున్నదని అడిగారా? ఇప్పుడు time అయిపోయిందనుకోండి. కాని ఈ కమిటీని వేసేటప్పుడు ఇంకా యితర పార్టీలుగూడ ఉన్నాయని వారిని గురించి ఏమైనా represent చేశారా ?

The Hon Sri N. Sanjeeva Reddi :— ఈ విషయములోఆంధ్ర రాష్ట్ర ప్రభుత్వానికి ఏమి సంబంధంలేదని చెప్పాను. ఆ విధంగా చెప్పిన తరువాతగూడ, గోపాలకృష్ణయ్యగారు ఢిల్లీ ప్రభుత్వం గురించి, మద్రాసు ప్రభుత్వం గురించి అడుగుతున్నారు. కేంద్ర ప్రభుత్వము గురించిగాని, మద్రాసు ప్రభుత్వము గురించిగాని ఈ ప్రభుత్వానికి ఈ విషయంలో ఏమి సమాచారం లేదని చెప్పుచున్నాను.

Sri T. Nagi Reddi :— ఈ ప్రభుత్వానికి ఈ విషయంలో ఏమి సమాచారం లేకపోతే, ఆ సమాచారాన్ని కనుక్కొని తెలియజేస్తారా ? ఈ విధమైనటువంటి కమిటీలను వేయడం సక్రమం గాదని ఈ ప్రభుత్వం ఇప్పటికైనా భావిస్తున్నదా ?

The Hon. Sri N. Sanjeeva Reddi :—ఈ ప్రభుత్వము ఎప్పుడు న్యాయమైన, సక్రమమైనపనులు చేయటానికే ప్రయత్నిస్తుంది.

Sri Pillalamarri Venkateswarlu :—అటువంటప్పుడు, ఈ ప్రభుత్వాన్ని ఏర్పరచినప్పుడు, ఏవిధంగా ఏర్పరచారు. అప్పుడు కాంగ్రెసుపార్టీ మెజారిటీగా ఉండినదా మెజారిటీ లేకపోయినప్పటికీ, ఏవిధంగా దీనిని ఏర్పరచింది. అవిధంగానే ఇతరపార్టీల విషయము ఎందుకు ఆలోచించ లేదు?

[22nd February 1954

The Hon. Sri N. Sanjeeva Reddi :—ఈ ప్రభుత్వము, ప్రారంభములోనే మూడు పార్టీలతో ఏర్పడింది. కాంగ్రెసుపార్టీ, సోషలిష్టు పార్టీ K. L. P. ఈ మూడు పార్టీలతో ఏర్పడింది

Sri Pillalamarri Venkateswarlu :- ఈ మూడు పార్టీలు కలసి ప్రభుత్వాన్ని స్థాపించారనేది సరికాదు. ఎందువల్లనంటే మొదట ప్రభుత్వాన్ని ప్రారంభించినప్పుడు, K. L. P. లేదు. అదిమధ్యలో వచ్చింది. తరువాత మళ్ళీపోయింది.

The Hon. Sri. N. Sanjeeva Reddi :—అదేమిగాదు. మొట్టమొదటతిమ్మారెడ్డిగారు చేరడంలో 4రోజులు ఆలస్యమైంది. అదితప్పితే మరేమిగాదు.

The Sri. Pillalamarri Venkateswarlu :—తిమ్మారెడ్డిగారువ్యక్తిగతంగా చేరారుగాని, K L. P. పార్టీ తరఫున చేరలేదు. తమస్వంత బాధ్యతపైన చేరారు.

The Hon. Sri P. Thimma Reddi:— కమ్యూనిష్టుపార్టీకి బహుశ బాధ్యతలులేవేమో, ఆవిధంగా K. L. P. పార్టీకి కూడ చెప్పడంసరికాదు.

Sri Pillalamarri Venkateswarlu :—On a point of order, Sir, తిమ్మారెడ్డిగారు, కమ్యూనిస్టుపార్టీ బాధ్యత లేనటువంటిది అని చెప్పారు. శాసనసభలో బాధ్యతగలఇంతపెద్దపార్టీ గురించి ఇలాచెప్పడం సరికాదు. ఆ మాటలను ఉపసంహరించుకోవలసిందని కోరుచున్నాను.

Mr. Speaker :—I think we are not discussing the position of parties here.

Sri Pillalamarri Venkateswarlu :—ఆలాంటిమాట ఉపయోగించడం సరికాదు. అది పార్లమెంటరీ మాటర్ మాటకాదు. కనుక దానిని వారు ఉపసంహరించుకోవలసిందని కోరుచున్నాను.

## *Gruel Centres in Penukonda Taluk.*

*116 Q.—Sri T. Lakshminarayana Reddi : Will the Hon. the Minister for Land Revenue be pleased to state—

(a) The amount spent on the gruel centres in Penukonda Taluk, Anantapur District, in 1952;

(b) Who are the contractors to supply 'Nuka' (broken grain) to the gruel centres in Penukonda Taluk in 1953, and

at what rates they were to supply the same and whether they had to supply by measurement or weight; and

(c) Whether the Tahsildar, Penukonda, demanded Rs. 10,000 as deposit from the contractors of 'Nuka' (broken grain) in his tender notice on 1-9-1953?

The Hon. Sri K. Koti Reddi:—

(a) The amount spent on the gruel centres in Penukonda Taluk (Anantapur Dt.) from April, 1952 to March 1953 was Rs. 1,10,041-7-3.

(b) Sri T. Gangadharayya, who was first appointed as Contractor, was supplying 108 seers of 'Nuka' for every 100 seers of grain supplied to him by the Tahsildar. He was paid at the rate of Rs 1-9-0 per bag of 100 seers towards milling charges. Subsequently tenders were called for and the lowest tender of Sri T. Narasayya at Rs. 0-10-0 per bag was accepted. Orders were also issued to the Tahsildar to issue grain by weight and receive the 'Nuka' also by weight.

(c) A sum of Rs. 5,000/- was demanded as cash security in addition to a sum of Rs. 5,000/- as personal security in respect of tenders called for by the Tahsildar, Penukonda in Bukkapatnam area. A sum of Rs. 1,000/- as cash security together with a sum of Rs. 1,000/- as personal security was demanded in respect of tenders in Penukonda area.

Sri. M. Veerabhadram :— తెలుగులో కూడ చెప్పించండి.

Mr. Speaker :—If the Hon. Member knows English why should we have it in Telugu again.

Sri M. Hanumantha Rao:— అయ్యా, తెలుగు వచ్చినవాడు ఆయన ఒక్క-డేకాదండి. చాలమంది యీ శాసనసభలో వున్నాము. మా కందరికీ తెలుగులో చెప్పడము అవసరం కనుక అడుగుతున్నాను.

Sri. M. Veerabhadram:— మొదట English లో చదివి, ఆ తరువాత తెలుగులో చెప్పించిన బాగుంటుందండి.

Mr. Speaker :— తెలుగులో అనువదించడానికి time కావాలండి.

Sri T. Lakshminarayana Reddi :— మొదటి tender కు రు. 1-9-0 చొ॥న యిచ్చారు. Bag కు రు. 0-10-0 చొ॥న tender వచ్చినప్పటికీ హెచ్చు tender accept చేసినందువల్ల కొన్నివేలు నష్టం వచ్చింది. ఇతరతాలూకాల్లో కూడా అంతా tender system పై వచ్చింది కనుక Penukonda తాలూకాలో అటువంటి నష్టంవచ్చినది కాబట్టి, ఆనష్టం భర్తీచేయుటకు ప్రభుత్వం దర్యాప్తు చేస్తుందా?

The Hon. Sri K. Koti Reddi :— Rules కు విరుద్ధంగా చేసి వుంటే దర్యాప్తు తప్పకుండా చేస్తాము.

*Deaths in the Sub-jails of Anantapur District.*

*117 Q.— Sri T. Lakshminarayana Reddi :- Will the Hon. the Minister for Law and Finance be pleased to state the number of deaths occurred in the Sub-jails in Anantapur district in 1952 and 1953?

The Hon. Sri T. Viswanatham :— In 1952 there was one death in Sub-jail, Anantapur. No deaths occurred in the remaining Sub-jails. During 1953 there was one death in Sub-jail, Uravakonda and one death in Sub-jail, Tadpatri. No deaths occurred in the remaining Sub-jails.

1952 సం॥లో అనంతపురం Sub-jail లో ఒక మరణము జరిగింది. మిగిలిన Sub-jails లో యేమీ లేవు. 1953 సం॥లో వురవకొండ Sub-jail లో ఒకటి, తాడిపత్రి Sub-jail లో ఒకటి జరిగింది. మిలిగిన Sub-jails లో యేమీ జరుగలేదు.

Sri T. Nagi Reddi:— ఈ మరణాలకు కారణము యేమిటో మంత్రిగారు సెలవిస్తారా ?

The Hon. Sri T. Viswanatham :— ఆ మాత్రం పూర్తిగా ప్రశ్న వేసివున్నట్లైతే యీ మరణాలకు సంబంధించిన అన్ని విషయాలు చెప్పగలిగేవాడిని. కనుక వేరే ప్రశ్న వేస్తే బాగుంటుంది.

Sri T. Nagi Reddi :— ఈ అనుబంధ ప్రశ్న కూడ వస్తుందని మంత్రిగారికి తెలిసివుండవలసింది. మంత్రిగారికి కాకపోయినా Secretariat staff అయినా అంత మాత్రం వూహించి, జవాబు యిచ్చి వుండవలసింది.

Sri R. Siddanna Gowd :— Sub-jails లో చనిపోయినవారు conviction కు ముందు చనిపోయారా ? తరువాత చనిపోయారా ?

The Hon. Sri T. Viswanatham :— వేరే ప్రత్యేక ప్రశ్న వేయించండి.

Sri M. Narayanaswamy :— Jail లో వున్నప్పుడు చనిపోయారంటే, వారి మరణానికి Police అధికారులే కారణమని చెప్పవలసి

వుంటుంది. అవి Police అక్రమాలవల్ల కాకపోతే, Police custody లో వారు వున్నప్పుడు జరిగింది. కనుక, ప్రభుత్వము ఈ విషయంలో Police అధికారులపై చర్యతీసుకుంటుందా? లేనియెడల, యికముందేనా సాహసిస్తుందా ?

The Hon. Sri T. Viswanatham :— సాహసించడానికి ఏమీ పెద్ద ప్రమాదము లేదండి. దానికి సంబంధించిన వివరాలన్నీ కనుక్కొని, చేయవలసిన పనులన్నీ చేయుటకు సిద్ధంగా వున్నాము.

Sri T. Potharaju :— ఈ Sub-jails లో ఖైదీలను కొట్టడం సామాన్యంగా జరుగుచున్నది. ఈ చనిపోవడానికి కారణం దెబ్బలవల్ల చనిపోవటమేనని అనుకొంటున్నాను. దెబ్బలుతిన్న ఖైదీలు ప్రభుత్వమునకు రిపోర్టులు పంపించారు. ఆ రిపోర్టులు ప్రభుత్వానికి చేరివుంటాయి. ఈ Sub-jails లో వున్న ఖైదీలను కొట్టకూడదని ప్రభుత్వం యేమైనా instructions యిచ్చారా? లేక పోతే యికముందైనా యిస్తారా ?

The Hon. Sri T. Viswanatham :— అక్రమంగా ఏ విధంగా జరిగినప్పటికికూడా, చర్య తీసుకొంటాము. ఇప్పుడు సభ్యుడు చెప్పిన వ్యవహారాలన్నీ కూడ పరిశీలిస్తాము.

*Grain Reception Centres in Anantapur District.*

*118 Q.—Sri S. Narayanappa:—Will the Hon. the Minister for Land Revenue be pleased to state—

(a) the number of grain reception centres in Anantapur district and the names of places where they are located ;
(b) the expenditure on each centre per month ;
(c) the quantity of grain now at stock in each centre ;
(d) the people responsible for the deficits in these centres ;
(e) whether there are any complaints against the officers who are in charge of these centres; and
(f) if so, the action taken thereon ?

The Hon. Sri K. Koti Reddi:—

(a) There are seven reception centres in Anantapur District in the places mentioned below :

1. Anantapur
2. Guntakal

[22nd February 1954

(a) *contd.*

3. Tadpatri
4. Dharmavaram
5. Penukonda
6. Hindupur
7. Kadiri.

(a)

(b) and (c) : A statement is placed on the table of the House.

(d) The Grain Reception Deputy Tahsildar at Guntakal and the Tahsildars concerned at the remaining centres are responsible for the supervision of these centres.

(e) The answer is in the negative.

(f) In view of the answer under Clause (e), this does not arise.

Sri S. Narayanappa :—ఈ grain receptions depots లో ఒకటి గుంతకల్లులో స్థాపించినట్లు మంత్రిగారు సెలవిచ్చారు. అక్కడ దాదాపు చాలపెద్ద మొత్తాలు deficit వచ్చినట్లు తెలుస్తున్నది. ఈ deficits యే వుద్యోగి పనిచేసేకాలంలో యేర్పడ్డాయో, సమగ్రంగా, ఆమూలాగ్రంగా విచారించి తగినచర్య తీసుకుంటారా ?

The Hon. Sri. K. Koti Reddi :—విచారిస్తాము.

Sri T. Nagi Reddi:—సభ్యులకు అందజేసిన statement చూస్తే ఒక్కొక్క సంవత్సరానికి నెలసరివారిగా expenditure, 1953 March లో రు. 220/- నుంచి April కు రు. 1,218-2-0 వరకు పెరిగింది. ఆవిధంగా పెరుగుతూ, యింత advance గా పెరగడానికి కారణము యేమిటి? Food grains supply తాడిపత్రి తాలూకాలో చాలతక్కువగాను, గుంతకల్లులో చాలఎక్కువగాను వుంటూవచ్చింది. ఈ పెరుగుదలకు, తగ్గుదలకు కారణమేమి ?

The Hon. Sri K. Koti Reddi :—A separate question may be put for details.

*Admission of voluntary patients in the Mental Hospital, Visakhapatnam*

*119 Q.—Sri M. Veerabhadram : Will the Hon. the Minister for Planning and Public Health be pleased to state-

---

(a) Vide Appendix I at page 87 infra

22nd February 1954]

(a) whether there is a G. O. limiting the maximum number of voluntary boarders (patients) to be admitted into the Mental Hospitals; and

(b) the total number of voluntary boarders admitted in the Mental Hospital, Visakhapatnam in the years 1951, 1952 and 1953 separately?

The Hon. Sri D. Sanjivayya :—

(a) The answer is in the negative.

(b) The required information is given below :—

| Year | No. of Voluntary boarders admitted. |
|---|---|
| 1951 | 31 |
| 1952 | 28 |
| 1953 | 33 |

Sri. M. Veerabhadram :—తెలుగులో చెప్పించండి.

The Hon. Sri. D. Sanjivayya :—Hon. Member వేసిన ప్రశ్నలో మొదటి భాగానికి "అటువంటి వుత్తర్వు ప్రభుత్వంయెప్పుడూ యివ్వలేదు." రెండవ భాగానికి జవాబు యేమిటంటే—

1951 సం॥లో 31 మంది

1952 సం॥లో 28 మంది

1953 సం॥లో 33 మంది బోర్డర్సు చేర్చబడ్డారు.

Sri. M. Veerabhadram :—ప్రభుత్వం Orders చేయకపోతే (Surgeon-General) Director of Medical Services దాని సంబరును limit చేస్తూ, వుత్తరవులు జారీ చేశారా ?

The Hon. Sri D. Sanjivayya:—ఈ ప్రశ్నకు సమాధానము తయారు చేసినప్పుడు, Director of Medical Services తో consult చేసే, కొంత సమాచారం చర్చించి తయారు చేయబడింది. ఆయన యిచ్చిన సమాచారంలో తప్పులేదని అర్థమౌతున్నది. అందువల్ల ఆయన కూడ తప్పు యిచ్చివుండడని నా అభిప్రాయం.

Sri. G. Latchanna :— ఈ హాస్పిటలులో patient కు తగినంత వసతిలేదనే విషయం ప్రభుత్వానికి తెలుసునా ?

The Hon. Sri D. Sanjivayya :— ఈ hospital ఒక్కటేకాదు. ప్రతీ hospital లోనూ యిదేవిధంగావుంది. మీరుకొంత సహాయంచేసి, ప్రజలు కొంత అప్పులుగాగాని contributions గా గాని యిచ్చినట్లైతే, తప్పకుండా అన్ని సౌకర్యాలు చేస్తాము.

Sri. M. Veerabhadram :—ఈ hospital లోని bed-strength ఎంతో చెప్పగలరాండి ?

The Hon. Sri D. Sanjivayya :— ప్రత్యేక ప్రశ్నవేస్తే చెప్పగలను.

*Local Library in Visakhapatnam.*

* 120 Q.—Sri M. Veerabhadram : Will the Hon. the Minister for Education and Industries be pleased to state.—

(a) when the Local Library authority, Visakhapatnam was constituted first;

(b) the amount realised by the Local Library Authority, Visakhapatnam under Section 12 (1) (a) of the Madras Public Libraries Act for the year 1952-1953;

(c) the amount contributed by the Government under Section 13 (2) (c) and 13 (3) for the year 1952-53;

(d) the amount spent on books and establishment separately, for the year 1952-53 and up-to date; and

(e) whether the building in which the District Central Library, Visakhapatnam is housed, is used exclusively for the Library.

The Hon. Sri S. B. P. Pattabhirama Rao:--

(a) The Local Library authority was started during 1950-51.

(b) Rs. 19,659-14-1.

(c) No grant was paid by Government under section 13 (2) (c) of the Madras Public Libraries Act. A contribution of Rs. 9,952-8-0 was paid by the Government during 1952-53 under section 13 (3) of the Act.

(d) Books worth Rs. 4,359-2-3 were purchased in 1952-53. Books worth Rs. 86-9-0 were bought up-to-date subsequent to 1st April 1953. A sum of Rs. 329-15-0 was spent during 1952-53 on establishment. The expenditure incurred on establishment from 1st April 1953 up-to-date is Rs. 1,699-3-0.

(e) No. Three unused rear rooms of the building have been let out to the Secretary, Local Library Authority.

22nd February 1954]

Sri R. Siddanna Gowd :-- ఈ District Library Committee ల పైన ఎంతఖర్చు చేయబడింది.

The Hon. Sri S.B.P. Pattabhirama Rao :--ప్రత్యేక ప్రశ్న వేస్తే అంతా చెప్పగలను.

Sri M. Veerabhadram :—Local Library Ex- Officio Secretary గారికి యీ building లో కొంతభాగము అద్దెకు యిచ్చి నట్లు చెప్పారు. ఈ rent నిర్ణయించినది యెవరండి ?

The Hon. Sri S. B. P. Pattabhirama Rao :—ప్రత్యేక ప్రశ్న వేస్తే చెప్తాను. ఆ building లోని వుపయోగపడని రెండు గదులను రు 30 లు అద్దెకు యిచ్చినట్లు కనబడుచున్నది.

Sri K. Rajagopala Rao :—Local Library authorities గా ఎవరెవరిని, ఏపద్ధతిపై సభ్యులుగా తీసుకుంటున్నారో చెప్పగలరా ?

The Hon. Sri S. B. P. Pattabhirama Rao :—దానికి ప్రత్యేకంగా ఒకనిబంధనలో ఒక ruleవుంది. ఆ నిబంధన ప్రకారము Director of Public Instruction వారు యేర్పాటుచేశారు. ప్రత్యేక ప్రశ్న వేస్తే చెబుతాను.

Sri T. Nagi Reddi :—ఈ యింట్లో యెన్ని Rooms లో Library వుంది ? ఎన్ని Rooms వాడుగకు యిచ్చారో తెలియ జేస్తారా ?

The Hon. Sri S.B.P. Pattabhirama Rao :—సరిగా plan మీ ముందు పెట్టలేను గాని, 3 unused rear rooms of the building have been let out to the Secretary, Local Library Authority.

Sri T. Nagi Reddi :—Library portion క్రింద యెన్ని rooms తీసుకొన్నదీ చెప్పలేదే ?

The Hon. Sri S. B. P. Pattabhirama Rao :—ఇందులో వివరంగాలేదు. The only details available with me now are that smaller rooms like verandahs have been left out, apart from the library portion occupied.

Sri T. Nagi Reddi :—అన్నరులో యెన్ని rooms లో library పెట్టబడిందో చెప్పలేదన్నాను.

The Hon. Sri S. B. P. Pattabhirama Rao :—The Director has also stated that the building in which the district central library, Vizag, is now located, was allotted by the Rent Controller, and that it is a private house not constructed as per the requirements of the Library. It has many rooms which cannot be used for library and so left of vacant. From that, three unused are lent. The building has still unused rooms, small rooms, varandahs, left over.

Sri R. Siddanna Gowd :—Library పెట్టినిమిత్తమై District Library Commitees అవసరములేదని భావించబడుతున్నది. కాబట్టి యీ District Library Act ను సవరణచేసి, ఒక Deputy Inspector కు గాని, District Educational Officer కు గాని Supervision power delegate చేయడానికి, Government అంగీకరించడానికి యోచిస్తారా ?

Mr. Speaker :—I disallow this question.

Sri M. Veerabhadram :—Library పెట్టిన rooms మూడున్నూ చిన్నవనిన్నీ, అద్దెకు యిచ్చిన మూడు rear unused rooms న్నూ రెండురెట్లు పెద్దవనే సమాచారము మంత్రిగారికి తెలుసునా ?

The Hon. Sri S. B. P. Pattabhirama Rao :—అది ఎంత వరకూ నిజమో నేను చెప్పలేను. Library కు సరిపోగా, మిగతా గదులలో మూడు మాత్రము వారికి ఉండుటకు అద్దెకుయిచ్చారు. ఇంకా కాళీగా కొన్నిగదులు ఆభవనములో వున్నాయి.

Sri T. Nagi Reddi :— ఆ Library building కు మొత్తం అద్దెయెంత ?

The Hon. Sri S. B. P. Pattabhirama Rao :—దీనికి సమాధానము యిందులో లేదు. కాని, ఈ భవనము అద్దెకు తీసుకొనబడిందని మాత్రం వుంది. వారు దీనికి కొంత advance యిచ్చినట్లు ఆ మొత్తము monthly instalment of Rs. 67 /- మినహాయించు కొనే పద్ధతిలో ప్రవేశించినట్లు తెలుస్తున్నది. ఇదంతా పాత ప్రభుత్వ హయాములో జరిగింది.

Sri T. Nagi Reddi :— ఆ library అద్దెఎంతో యిందులో యివ్వ లేదు. కాబట్టి యెంతభాగము యెంతఅద్దెకు యివ్వబడిందో తెలియు

జేయండి. అద్దెకు యివ్వబడిన rooms పెద్దవికాబట్టి, యిప్పుడు యీ చర్చలో జరిగేవిషయాలన్నిటిగురించి దర్యాప్తు చేస్తారా ?

అద్దెకు యివ్వబడినవి చాల పెద్దవి కాబట్టి, ఆ rooms library కు వుపయోగించుకొనడానికి బాగుంటుంది. కాబట్టి, దీసిని గురించి సక్రమంగా శ్రద్ధగా పరిశీలించి తక్కువ ఖర్చులు* library కి పెట్టేటట్లు చూడవలసిందని అంటున్నాను.

The Hon. Sri S. B. P. Pattabhirama Rao :— Leader of the Opposition యీ విషయంలో కొంత పొరపాటు పడుతున్నారని నా అభిప్రాయం. వారు library గదులు చాల చిన్నవని వూహించుకొంటున్నారు. వారు అడిగిన ప్రశ్నకు సమాధానము వివరాలు నాకు వచ్చిన information లో లేదు. Library కు కావలసిన స్థలాన్ని అంతాపూర్తిగా వుపయోగించుకొన్న తరువాత మిగిలిన unused rooms ను మూడుమాత్రం వారికి అద్దెకు యిచ్చారు. ఈ library కుసంబంధించిన విషయాలన్నిటినీ కనుగొనుటకు సిద్ధముగా వున్నాము. దీనికింత కాలము వృధాచేసేకంటే, hon. member Sri. Veerabhadram గారు నాకువ్రాస్తే నేనుసమగ్రంగా విచారించుతానని మనవి చేస్తున్నాను.

*Varieties of Bamboo.*

*121 Q.—Sri K. Govinda Rao:—Will the Hon. the Minister for Local Administration and Agriculture be pleased to state whether any varieties of bamboo found in the Schedule for the year 1952-53 in respect of forest coupes, were excluded this year; and

(b) if so, why?

The Hon. Sri P. Thimma Reddi:—

(a) The following eight varieties of bamboos have been excluded from the sale notice and schedule of 1953-54 bomboo coupe agreements, though they find a place in the bamboo coupe agreements for 1952-53.

| | |
|---|---|
| 1. Pedda Bongulu or Mallam | 5. Chilachina Veduru |
| 2. Intisadhanam | 6. Kathipidulu |
| 3. Gattisadhanam | 7. Yetham Gedalu |
| 4. Chiguru or Yendina Veduru | 8. Veduru Kampa |

(b) The omission took place on account of a mistake on the part of the District Forest Officer. The matter has been fully investigated and steps are being taken to include the eight varieties referred to in the answer to clause (a) above both in the sale notice and agreement for 1954-55.

1953-54 సం॥లో యీ వెదురు coupe agreementsలో 8 రకాలు మాత్రమే sale notice లో చేర్చబడలేదు. ఆమాదిరిగా చేర్చ కుండా ఉండిన పొరపాటును తరువాత గ్రహించి, 1954-55 సం॥కి వచ్చే వేలంలో ఆ 8 రకాల వెదుళ్ల కూపులనుకూడ చేర్చబోతున్నాము.

Mr. Speaker:—No more supplementary questions.

*Transfer of non-Gazetted Officers in Revenue Department.*

*122 Q.—Sri K. Krishna Rao: Will the Hon. the Chief Minister be pleased to state:—

(a) whether it is a fact that there is a rule that Non-Gazetted Officers in Revenue Department are not liable to inter-district transfers;

(b) whether there is any similar rule in the case of Non-Gazetted Officers in other departments; and

(c) if there is no such rule, the reasons for not having such a rule in the case of other departments?

The Hon. Sri T. Prakasam:—

(a) It is presumed that the Hon'ble Member refers to the Ministerial staff of the Revenue Department. If so, they are not ordinarily liable to inter-district transfers under the Special Rules for the Ministerial Service.

(b) The same rules apply in respect of transfers of Ministerial staff in other departments also. In certain Departments such as Local Fund Audit and Port Departments the entire department is treated as one Unit and the members are liable to transfer within the department. In the case of Medical Department, the department has been divided into four groups, each group comprising a number of districts and the members are ordinarily liable to

22nd February 1954]

transfer within the particular group. The unit for transfers has been determined with reference to the administrative needs of each department.

(c) The question does not arise.

Sri K. Krishna Rao :— Governent Service లో Non-Gazetted Officers ను Transfer చేయడంలో, వారిని ఒక జిల్లానుంచి యింకొక జిల్లాకు Transfer చేయడంవల్ల వారు చాలా ఇబ్బందులకు లోనవుతున్నారు. వారికి తక్కువజీతం అగుట ఒకటి. ఒకచోటనుంచి ఇంకొకచోటకు చాలా దూరదూరంగా Transfer చేయడంవల్ల వారికి convenience ఏమీలేక చాలా బాధపడుతున్నారు. Co-operative Department లో Senior Inspectors ను ఒక జిల్లానుంచి ఇంకొక జిల్లాకు దూరదూరంగా transfer చేయడం జరుగుతోంది. Revenue Department లోని N. G. O. లకు Inter-District Transfers లేవు అనే నిబంధన ఏమైనా ఉన్నదా? ఉంటే ఆ నిబంధనను Revenue Department కు వలెనే ఇతర Departments లోని Non-Gazetted officers కు కూడా వెనువెంటనే అనువర్తించేటట్లు చేస్తారా? అని నా ప్రశ్న.

The Hon. Sri T. Prakasam :—మీరువేసిన ప్రశ్న అంత సులభంగా లేదు.-వారు చెప్పినంత సులభంగా లేదు. దీనిగురించి ఆలోచించి ఎట్లా చేయువలెనో అట్లాచేస్తాము. ఇంతకంటె చెప్పడానికి వీలులేదు.

*Septa over Gundlakamma.*

* 123 Q.—Sri S. Kasi Reddi : Will the Hon. the Deputy Chief Minister be pleased to state :

(a) whether the Government received any representation or petition from the people of Vinukonda, Guntur District and Kurichedu (Darsi taluk), Nellore District requesting the Government for the construction of a septa over Gundlakamma river, on the road that runs from Kurichedu to Vinukonda to facilitate trade and traffic; and

(b) if so, the action taken by the Government?

The Hon. Sri N. Sanjeeva Reddi.—

Clause (a).......The answer is in the negative.
Clause (b)......Does not arise.

Sri S. Kasi Reddi:—గుంటూరుజిల్లా వినుకొండ, నెల్లూరుజిల్లా, దర్శితాలూకా కురిచేడులమధ్య నున్నరోడ్డులో గుండ్లకమ్మ నదివున్నది. దానిపై బ్రిడ్జీగాని, సప్టాగాని లేదు. అందువల్ల వినుకొండనుండి కురిచేడుకు రాకపోకలకు చాలాయిబ్బందిగాఉన్నది. అందుచేత అక్కడ సప్టాగాని, బ్రిడ్జీగాని కట్టడానికి ప్రభుత్వం ఆలోచిస్తూందా ?

The Hon. Sri N. Sanjeeva Reddi :--ముఖ్యమంత్రిగారికి జనవరి నెలలో ఒక Petition అద్దంకి వారివద్దనుంచి వచ్చింది. దానిగురించి Chief Engineer గారితో చెప్పడం జరిగింది ఈ విషయమై తగుచర్య తీసుకోవలసినదిగా Chief Engineer గారితో చెప్పాము. కాని దేశములో చాలా చిన్నచిన్న నదులు ఉన్నాయి. వాటిపై బ్రిడ్జీలు అన్నీ కట్టాలని ప్రభుత్వం అనుకుంటుంది. అన్నిటినికూడా ప్రజావసరాలనుబట్టి కట్టడానికి ఆలోచిస్తున్నాము. ఇలాంటి బ్రిడ్జీలు దేశంలో అన్నినదుల మీద ప్రజావసరములకొరకై కట్టడం చాలా అవసరం. వంతెన ఒక గుండ్లకమ్మకు మాత్రమేగాక అన్నినదులపైనా అవసరమే. దీనిని అన్నిటితోబాటు కట్టడానికి ఆలోచిస్తాము.

Sri M. Bapiah Chowdary :— యిటువంటి పరిస్థితుల్లో రాయలసీమలోనైనాకూడా ఇలాగేచెప్పేవారా ? ఈవిధంగా చెప్పరని అనుకొంటున్నాను. గుంటూరుజిల్లాలో కాబట్టి దీనిపై ప్రత్యేక ...

The Hon. Sri. N. Sanjeeva Reddi :—మీది గుంటూరుజిల్లా కాబట్టి మీరు ఇలాచెప్తారు. మీరు ఊహాగానంలో తేలుతున్నారు. అంతే. అలాంటిదేమీకాదు. దీనివిషయమై త్వరలోనేచర్యతీసుకోడానికి ఆలోచిస్తున్నాము.

Sri. S. Kasi Reddy :— ఆర్యా ! బ్రిడ్జికట్టడానికై ఎక్కువ ఖర్చయితే, తక్కువఖర్చుచేసి కనీసం ఒక సప్టా అయినా కడితే ప్రయాణం చేయటానికి వీలుఉంటుంది. కాబట్టి సప్టా అయినా కట్టడానికి ప్రభుత్వం అలోచిస్తున్నదా ?

The Hon. Sri N. Sanjeeva Reddi :-- అన్నింటినీ కట్టాలని ఆలోచిస్తున్నాము. కాని ఎప్పుడు కట్టాలీ అని ఆలోచిస్తున్నాము.

Sri K. Malakondayya :--అన్నిటినీ కలిపి ఒకేసారికట్టాలని అనుకుంటున్నామని మంత్రిగారు చెప్పారు. కాబట్టి బ్రిడ్జిలు కాని సప్టాలు

22nd February 1954]

కాని ముఖ్యమైనవిగా తొందరగా నిర్మించాల్సిన అవసరముంటే ఇపుడు కట్టడానికి ప్రయత్నం చేస్తారా ?

The Hon. Sri N. Sanjeeva Reddi :-అన్నిటిమీదా కట్టాలని ఉంది. కాని అన్ని ఒకేసారి కట్టడం ఎలాగవుతుంది ? ఒకదాని తరువాత ఒకదానిని కట్టడం జరుగుతుంది. అలాకాకుండా, దీనిని త్వరలో కట్టుటకు ఆలోచిస్తున్నాము. అందుచేత మీరు సంతోషించాలి.

Sri P. Pundarikakshacharyulu:-- ఈమధ్య మా ప్రాంతంలో నాగావళినదిపై సంకిలిదగ్గర బ్రిడ్జికి శంకుస్థాపనచేస్తూ సంజీవరెడ్డిగారు ఎవరో కొంతమంది వారిపక్షంవారు ఈ బ్రిడ్జి కట్టమని కోరారని, అందువల్ల ఈ బ్రిడ్జిని కట్టించడం జరుగుతోందని అన్నారు. దీనికి అటువంటి వారెవరూ కోరలేదని కట్టించడం జరగడంలేదా ? అని నాప్రశ్న.

The Hon. Sri N. Sanjeeva Reddi :--కొంచెం న్యాయమైన వారు చెప్పినట్లైతే దానిని తప్పకుండా చేస్తాము.

Sri M. Hanumantha Rao :--ఉపముఖ్య మంత్రిగారు న్యాయమైనవాళ్లు చెప్తే చేస్తామన్నారు. న్యాయమైనవారు అంటే వారిదృష్టిలో ప్రభుత్వమునకు అనుకూలంగా ఉండే వారనా ? లేక కాంగ్రెస్ పార్టీకి సంబంధించినవారనా ? ఏమిటి ?

The Hon. Sri N. Sanjeeva Reddi :—అదేమీ కాదు విచక్షణ, విజ్ఞానం కలవాళ్లు మాత్రమే.

Sri T. Nagi Reddy :—విచక్షణ, విజ్ఞానము, ఎలాంటివాళ్ళకు ఉంటుంది ? విచక్షణ, విజ్ఞానం ఉండేవాళ్లు అంటే, విచక్షణ, విజ్ఞానం అనే వాటికి Definition చెప్పవలయునని కోరుచున్నాను.

The Hon. Sri N. Sanjeeva Reddi:—అన్నివిషయములలోను, అన్నిపనులనులోను, అన్ని పాయింట్లలోను, న్యాయమైన ఉద్దేశ్యములు ఉన్నవాళ్ళండి.

*Memorandum from the Ryots' Association of Nellore District.*

*124 Q.—Sri G. Yellamanda Reddi :—Will the Hon. the Minister for Land Revenue be pleased to state —

(a) whether the Government have received any memorandum from the representatives of the Nellore District

Ryots' Association, on the issue of the breaches to the tanks nearing 150 due to recent rains in the district ; and

(b) if so, the action taken thereon ?

The Hon. Sri K. Koti Reddi :—(a) Yes. The memorandum was presented to the Collector on 27-10-1953.

(b) Immediate instructions were issued to all the Minor Irrigation staff, Rural Welfare Scheme Overseers, Executive Engineer (P. W. D), Executive Engineer (Food Production), Nellore, to attend to the closure of breaches so that water could be conserved in the tanks for the standing crops The District Agricultural Officer has been instructed to distribute paddy seeds liberally to the ryots.

Regarding grant of remissions, steps will be taken at the time of the Jamabandi of the villages concerned for granting remissions under B. S. O. No. 13 in all cases where the crops were lost due to submersion.

Sri V. Srikrishna:--మరమ్మతులు చేయడానికి instructions యిచ్చామని మంత్రిగారు సెలవిచ్చారు. ఆమరమ్మతులు మళ్ళీ వర్షాలు కురిసేలోపల పూర్తిఅవుతాయని హామీనియిస్తారా ?

The Hon. Sri K. Koti Reddi:-అనుమానపడే వారందరికీ అనుమానాలు ఎక్కువగావస్తాయి. అయినా కాని మరమ్మతులు చాలావరకు మాత్రం జరిగాయి. పని చాలాభాగం జరిగింది. ఇప్పటికి P. W. D. tanks కు 60 వేల రూపాయలు ఖర్చుపెట్టాము. Minor Irrigation పనులకుగాను 1 లక్ష 20 వేల రూపాయలు ఖర్చుపెట్టాము. అందువల్ల ఇప్పటికి చాలావరకు పనులు, మరమ్మతులు పూర్తయినాయి.

Sri B. Sankaraiah :--మరమ్మతులు వర్షాలు కురిసేలోపల చేస్తే బాగుంటుంది. చెరువులకట్టలు మరమ్మతు చేయడం కూడా అవసరం. వాటిని వర్షాలు వచ్చేలోపల పూర్తిచేయాలి. లేకపోయినట్లయితే వర్షములు పడినతరువాత కట్టలు తెగి ఈ సంవత్సరం పంటలు నష్టపోతాయి. అందుచేత ఈ మరమ్మతులకు సాధ్యమైనంతత్వరలో పూర్తిచేయుటకు చర్యలు తీసుకోవాలని ప్రభుత్వానికి మనవిచేస్తున్నాను.

The Hon. Sri K. Koti Reddi :--సాధారణంగా repairచేయాలనీ, instructions యివ్వడం జరిగింది. చాలావరకు repair లు పూర్తి అయాయి. మిగిలినదిగూడా సాధ్యమైనంతవరకు పూర్తిచేస్తామనిచెప్పాను.

Sri P. Pundarikakshacharyulu -- అటువంటి మరమ్మతులు ఒక్క నెల్లూరు జిల్లాలోనే కాక మిగిలిన జిల్లాలలో కూడా వున్నాయని తెలుసునా? అయితే నెల్లూరుజిల్లాలో మరమ్మతులు చేయడానికి instructions యిచ్చామంటున్నారు ఇతర జిల్లాలలోకూడా ఇటువంటి instructions నే యిచ్చారా? మీరు ఇచ్చిన instructions ఎంత వరకు Carry out చేస్తున్నారో ప్రభుత్వం తెలుసుకొంటోందా?

The Hon. Sri K. Koti Reddi:-ఇతర జిల్లాలసంగతి ఈ question లో రాదు. ఈ question కి యితర జిల్లాలకు సంబంధంలేదు. అందుచేత ఇతర జిల్లాలో నున్న మరమ్మతుల సంగతి, అక్కడ తీసుకొనబడే చర్యలు గురించి separate గా question వేస్తే information తెప్పించి చెప్తాము.

Sri T. Nagi Reddi :- ఇది చాలా చిన్న ప్రశ్నేనండి. ఈ మరమ్మతుల విషయంలో ఈ విధమైన instructions ను యివ్వడమైనదా? అయితే అవిఎంతవరకూ జరిగాయో ప్రభుత్వానికి తెలుసునా? తెలియదా అని.

The Hon. Sri. K. Koti Reddi :-- కలెక్టర్లనుండి ప్రతివారం పని ఎంతవరకు జరిగిందో, ఇంకా ఎంతపనివుందోనని దానిని గురించి వారి అభిప్రాయములను తెలియజేస్తూ రిపోర్టులు వస్తాయి.

Sri S. Kasi Reddi:-- ఆర్యా! నెల్లూరుజిల్లాలో వర్షములు కురిసినపుడు 100 నుంచి 120 చెరువులకుపైగా కట్టలు తెగి పాడై పోయాయి. వాటి అన్నిటికి మరమ్మతులను వెంటనేచేయడానికి ప్రభుత్వం instructions యిచ్చామన్నారు. వాటిని మరల వర్షములు కురిసేలోపలనే చేయవలయును. వాటిలో కొన్నిటికి మరమ్మతులు చేయుట మొదలు పెట్టనేలేదని ప్రభుత్వానికి తెలుసునా? కొంతవరకు మరమ్మతులు చేయడమైనదని అంటున్నారు. అందుచేత వాటిని త్వరలో వర్షములు కురవకుండానే మొదలుపెట్టి పూర్తిచేయడానికి శీఘ్రంగా చర్యలు తీసుకోవాలని కోరుతున్నాను.

The Hon. Sri K. Koti Reddi :- ఈ మరమ్మతుల విషయమై త్వరగా చేయుటకుగాను P. W. D. వారికి చెప్పడమైనది. ఈ మరమ్మతులు త్వరగా వెంటనే చేయాలను కుంటున్నాము. అన్ని జిల్లాలలోని మరమ్మతుల విషయంలోను త్వరగా చేయుటకు తగు ఆలోచన చేస్తామని చెప్తున్నాను.

[22nd February 1954

Sri T. Lakshminarayana Reddi :—జిల్లా రైతుసంఘముల వారు irrigation విషయములపై జిల్లా అధికారులకు విన్నవించుకోడానికి వెడితే, వారికి మామూలుగా Interview యివ్వడంలేదు. వారికి Interview దొరకుటకు చాలా కష్టమైపోతోంది. Interview దొరకడమే కష్టసాధ్యంగా ఉంది. వారు Irrigation విషయములగురించి అధికారులకు పరిస్థితులను తెలియ పరచుకోడానికి వీలులేకుండా ఉంది. అందువల్ల ఆరైతులకు కొంతకష్టంగా ఉన్నది అటువంటివారి కష్టములను తొలగించేందుకు వారికి Interview దొరికేటట్లు చేయుటకు ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

The Hon. Sri K. Koti Reddi:--Question కి దీనికి ఏవిధమైన సంబంధంలేదు. ఇంతవరకు ఈ విధమైనటువంటి విషయములను చెప్పటానికి నాదగ్గరకు ఎవరూరాలేదు మామూలుగా ఏమైనా విషయాలను చెప్పడానికి వస్తూంటారు మేముమాత్రం interview లేదని సాధారణంగా ఎవ్వరికీ చెప్పడంజరగదు.

Sri T. Lakshminarayana Reddi :--మీరు కాదండీ, జిల్లా Head quarters లోనున్న జిల్లా అధికారులు interview ఇవ్వడం లేదని నేను చెప్పానండీ !

The Hon. Sri K. Koti Reddi :-- అక్కడవారు Interview ఎవరెవరికి యిస్తున్నారో ? ఎవరెవరికి యివ్వడంలేదో అనే చిన్న చిన్న విషయాలుకూడా మేమేంచెప్పగలం ? అయినా వారికి, Interview యివ్వమని, యివ్వవద్దని మేమెలాచెప్పడం ?

Sri R. Siddhanna Gowd:--వర్షములు కురవడం ప్రారంభం అయేలోపల మరమ్మతులు పూర్తి అవుతాయాఅని నా question ?

The Hon. Sri K. Koti Reddi :—తప్పకుండా ఆమరమ్మతులనుచేయడానికి వెంటనే చర్యలు తీసుకుంటామని చెప్పియున్నాను. ఆమరమ్మతులను సకాలంలో చేయడానికి శీఘ్రంగా చర్యలు తీసుకుంటాము.

Sri K. Malakondayya :—నెల్లూరు జిల్లాలో దాదాపు చాలా చెరువులు పాడైపోయినట్లు తెలుసునా ? అయితే ఎన్ని చెరువులకు ఇంతవరకు ఏవిధమైన మరమ్మతులు చేయబడినవి. ఎన్నిచెరువులు పాడైపోయినవి ? ఎన్నిచెరువులకు ప్రాథమికమైనవి తగు మరమ్మతులు చేయబడ్డాయి ! ఎన్నిచెరువులకు ఇంకా మరమ్మతులు చేయాలి ?

22nd February 1954]

The Hon. Sri K. Koti Reddi :-- ఎలాంటి చెరువులుపోయినవో ఎన్ని చెరువులు మరమ్మత్తు చేయబడ్డాయో, ఎన్ని చెరువులకు మరమ్మతులుచేయాలో అవన్నీ నంబర్లుఉన్నాయి. ఆ numbers చెప్పాలి. కాని వాటివివరములు, ఆ number లు కొన్నిమాత్రమే ఉన్నాయి. మాకు ఈ విషయంలో సరియైన information రాలేదు. ఆ నంబర్లు సరిగా లేక తప్పుగా ఉండడం జరుగుతుంది. సరైన information ఏమి లేదని. చెప్తున్నాను. సరైన information తెప్పించాలి.

Sri T. Nagi Reddi :--ఆ నంబర్లే చెప్పండి.

The Hon. Sri K. Koti Reddi :--Work in the case of 112 works has been completed. 39 works are in progress. In the case of 12 works, work could not be started as there was water in the tank. A lakh and two thousand has so far been spent for closing the breach. Under Public Works, a sum of 60,000 rupees has been spent so far, the number of works so executed is not available.

Sri K. Ramayya Chowdary :— తెగిపోయిన చెరువుల విషయంలో ఇప్పటివరకూ పరిశీలన జరగలేదనే సంగతి మన ప్రభుత్వం వారికి తెలుసా ?

The Hon. Sri K. Koti Reddi :— మీరుఆ తెగిపోయిన చెరువుల సంఖ్య తెలియచేస్తేసరి. వాటిని గురించి ఉద్యోగస్తులకు తెలియచేస్తాం.

Sri P. Pundarikakshacharyulu :— ఈ మధ్యరద్దైన ఎస్టేట్లలో ఈ మరమ్మతు పనులు గురించి రెవెన్యూ డిపార్టుమెంట్ Public works department వారు మీదంటే మీదని తగువులాడుతున్నారు. దీన్నిగురించి ప్రభుత్వంపమైనా నిర్దిష్టమైన విధానం, చర్యతీసుకుంటుందా ?

(No Answer).

*Co-operative Motor Transport Society, Visakhapatnam*

*125 Q.—Sri M. Veerabhadram :—Will the Hon. the Minister for Planning and Public Health be pleased to state—

(a) whether the Auditor suggested the change of the present Manager of the Co-operative Motor Transport Society, Visakhapatnam, as he is not technically qualified;

(b) whether complaints of mismanagement etc., were made to the Registrar of Co-operative Societies against the Manager; and

(c) if so, the action taken thereon ?

The Hon Sri D. Sanjeevayya :—(a) No auditor has made any such suggestion in the audit reports of the Society till the year ending 1951–52. The final audit report of the Society for the year 1952–53 has not yet been received. The Deputy Registrar of Co-operative Societies, Visakhapatnam, however, observed in his notes of inspection of the society for the half year ended 31–12–1952 that the Manager, being a non-technical man, could not be able to control the work of the technical staff of the society and suggested that the society might appoint a person qualified in automobile engineering with workshop experience. The Society has not, so far, taken action to implement the suggestion.

(b) and (c) Complaints were received in October 1953 by the Registrar of Co-operative Societies against the Manager of tbe Society. They are being examined by the Registrar in consultation with the Deputy Registrar of Co-operative Societies, Visakhapatnam. The Registrar is also examining a resolution of the general body of the Society passed on 6–12–1953 expelling the Manager from membership. Under the by-laws of the Society, the resolution will come into force only after it is approved by the Registrar.

**Sri M. Bapayya Chowdary** :-అధ్యక్షా! ఇప్పుడు Technical Qualifications లేనటువంటి అభ్యర్థులను నియమించారు. వారిని నియమించి ఎన్నిసంవత్సరాలైంది? Technical qualifications ఉన్నవాళ్ళు వస్తేవాళ్ళను తొలగిస్తారా?

**The Hon. Sri D. Sanjivayya**:-Technical గా qualified persons ను appoint చేయాలని ఎక్కడా లేదు. అట్లా ఉన్నట్లయితే చేసుకోవచ్చు.

**Sri Pragada Kotaiah**:---మంత్రిగారు 1952–53 audit ఇంకా పూర్తికాలేదని చెప్పారు. అన్ని సొసైటీల ఆడిట్ అలాగే ఉన్నదా?

**The Hon. Sri D. Sanjivayya**:-- అన్నీ అలాగే వున్నాయని చెప్పడానికిలేదు. మీరు ఎక్కువ Staff ను వేస్తే త్వరగా Report ఇవ్వడానికి ప్రయత్నం చేస్తాం.

22nd February 1954]

Sri V. Srikrishna :-- Technical నైపుణ్యం గలవారిని అక్కడ నియమించాలనే నిర్బంధం లేకపోయినా అక్కడ ఉన్నటువంటి పని స్వభావాన్నిబట్టి అటువంటివారిని నియమించవలసిన అవసరం ఉంది. పైగా వాళ్ళను గురించి పిర్యాదులు కూడా ఉన్నాయి. నైపుణ్యం లేని వ్యక్తులను అక్కడ పెట్టడానికి ఇతర కారణాలు ఏమైనా ఉన్నాయా ?

The Hon. Sri D. Sanjivayya: —ఇతర కారణాలు ఏమీ లేవు. కాని, General body మీద resolution ఆయనకు ఇచ్చారు. ఆ తరువాత ఆయన రాజీనామా ఇచ్చి బైటికి పోయినాడు.

Sri M. Veerabhadram :— ఈ సంస్థలో 30 Vehicles ఉన్నాయి. కాబట్టి దాన్ని manage చేయడానికిగాను దానికి ఇంజనీరింగ్ qualification ఉండాలని ఉంది. దీనిమీద inspection report కూడాఉంది. ఆ report ను అమలుజరపడానికి ప్రభుత్వము తీసుకున్న చర్యఏమిటి ?

The Hon. Sri D. Sanjivayya :— నేను ఈ రాష్ట్రములోనే కాదు ఉమ్మడి రాష్ట్రంలోకూడా సహకారశాఖామంత్రిగా ఉన్నసంగతి మీకందరకు తెలుసు. ఇటువంటి అభ్యంతరం ఎప్పుడూ నా దృష్టికి తీసుకురాబడలేదు.

Sri P. Pundareekakshacharyulu:—ఇంతవరకువున్న Manager official మానేజరా లేక non-official మానేజరా ?

The Hon. Sri D. Sanjivayya :--Non-Official manager కాదండి.

Sri R. Siddanna Gowd :-- ఈ official manager ను సిఫారసు చేసిన వారు Deparment వారా లేక Director లు రికమండ్ చేశారా?

The Hon Sri D. Sanjivayya :--ప్రత్యేక ప్రశ్నవేస్తే సమాధానం చెపుతాం.

Sri Pragada Kotaiah :--ఈ అనధికార సంస్థలో ఉద్యోగస్థులను ఉంచాలా అక్కరలేదా అనేవిషయంలో ప్రభుత్వానికి ఉన్న సంబంధం ఏమిటి ?

(No reply)

[22nd February 1954

Sri M. Veerabhadram :-- 6-12-53 తేదీన చేసిన తీర్మానం Registrar of Co-operative Societies అంగీకరించకుండా వాయిదా వేయడానికి కారణం ఏమిటి? మీరు ఇంకా ఉద్యోగంలో ఉంచడానికి ప్రయత్నం చేస్తున్నారని అనుమానంగాకూడా ఉంది. అలా ఉద్యోగపరిమితి పెంచాలని ప్రభుత్వం వారి ఉద్దేశమా?

The Hon. Sri D. Sanjivayya:-- తీర్మానమైతే ఆమోదించి ఉండచ్చు. తీర్మానాన్ని Registrar of co-operative Societies కు ఎప్పుడు అందచేశారో పరిశీలించాలి.

Sri Pragada Kotaiah:--అధ్యక్షా! సహకార సంఘాల్లో ఉద్యోగులను నియమించే విషయంలోగాని, తీసివేసే విషయంలోగాని ఆయా సంఘాలఅధ్యక్షులకుగాని, పరిపాలకవర్గాలకుగాని, సంబంధించిన విషయం అయినప్పుడు సహకారసంఘాల రిజిష్ట్రారుకుగాని, ప్రభుత్వానికిగాని సంబంధించిన విషయం ఎలా అవుతుంది?

The Hon. Sri D. Sanjivayya:--ఈ విషయంలో ప్రభుత్వానికి ఏలాంటి సంబంధము లేదు. ఈ విషయం కోటయ్యగారికికూడా తెలుసు.

Sri R. Siddanna Gowd:--సాంకేతిక విజ్ఞానం కలిగినటువంటి వారిని appoint చేయడం ఉచితమా? అనుచితమా?

The Hon. Sri D. Sanjivayya:--అటువంటి సాంకేతిక జ్ఞానం కలిగినవారిని ఉద్యోగంలో పెట్టడం ఉచితమూ సమంజసమూ కూడాను.

Sri M. Veerabhadram :-ఈ manager మీద complaint చేసిన ఒక వ్యక్తిని సొసైటీలో ఉద్యోగం నుంచి తొలగించడానికి 36 గంటలు కూడా పట్టలేదు. ఈ తీర్మానం అమలు జరగడానికి రిజిష్ట్రారుగారు ఎందుకు ప్రయత్నించలేదో శలవిస్తారా?

The Hon. Sri D. Sanjivayya :--ఉద్యోగం నుంచి తొలగించామని వారు చెపుతున్నారు. వారు చెపితేగాని నాకు తెలియదు.

Sri S. Narayanappa :---ఈ సహకార సంఘాల్లోఉన్న ఉద్యోగస్థులను ఈ Board of Directors కు ఎప్పటి కప్పుడు తీసేసే అధికారం ఉంది. అది ప్రజాస్వామికం అనిపించుకుంటుందా? అటువంటి అనవసర మైనచర్య, సిబ్బందిని సేసే విషయంలో ప్రభుత్వం వారు జోక్యం కలుగ చేస్కొని న్యాయం జరిపించుదురా అని ప్రశ్నించుచున్నాను.

22nd February 1954]

The Hon. Sri D. Sanjivayya :--పై రెండు మూడు సమాధానాలు చదివినప్పుడు నారాయణప్పగారు వినలేదేమో అని నా అనుమానం. జనరల్ బాడీవారు తీర్మానం ఆమోదించారు. సొసైటీ బైలాన్ ప్రకారం రిజిష్ట్రారు ఆమోదం పొందిన తరువాత అమల్లోకి వస్తుంది.

*Zonal System of Foodgrains.*

* 126 Q.—Sri S. Vemayya : Will the Hon. the Minister for Land Revenue be pleased to state —

(a) whether the Government requested the Union Government to scrap the zonal system of foodgrains in the state ;

(b) whether any quantity is proposed to be given to Madras State; and

(c) if so, the quantity ?

The Hon. Sri K. Koti Reddi :

(a) Yes.

(b) Yes.

(c) The Government have agreed to supply two lakhs tons of rice to Madras State during the year 1954, one lakh tons on Government to Government account and another lakh tons to the open market in the Madras State through the agency of private dealers.

Sri B. Sankarayya :---మొదటి ప్రశ్నకు మంత్రిగారు సమాధానం యిచ్చారు. జోనాల్ పద్ధతి రద్దుచేశామని. కాని ఒక తాలూకా నుంచి మరొక తాలూకాకు ధాన్యం తీసుకుపోవడానికి అభ్యంతరాలున్నాయి. అందుచేత Surplus area లో వున్న ఒక తాలూకాలోని ధరలకు, deficit area లో మరొక తాలూకాలోని ధరలకు తేడాలున్నాయి. వీటిని గురించి ఏమిఏర్పాట్లు చేశారో సమాధానం చెప్తారా, లేక వీనినిగురించి చర్చించడానికేమైనా అవకాశం కల్పిస్తారా ?

The Hon. Sri K. Koti Reddi :---బోర్డరు ఏరియాలలో smuggling ఆపుచేయడానికి కొన్ని నిబంధనలు పెట్టాము. ఇప్పుడు వాటిని కూడా తొలగించాము. తొలగించిన తరువాత కూడాSmuggling జరుగుతున్నదా లేదా అని పరిశీలిస్తున్నాము. ఇతరరాష్ట్రాలకు మాత్రం పర్మిట్లులేకుండా ధాన్యం తీసుకుపోకూడదు.

**Sri B. Sankarayya** :—మా జిల్లాలో వున్న కావలి, కొవ్వూరు, కందుకూరు తాలూకాలలో ఒకతాలూకానుంచి మరొకతాలూకాకు సరుకును పోనివ్వడంలేదు. అందువల్ల కావలి తాలూకాలో ఒకధర కందుకూరు, కొవ్వూరుతాలూకాలలో వేరొకధర వున్నది. కాబట్టి ఈ restrictions తీసివేస్తారా ?

**The Hon. Sri K. Koti Reddi** :—అటువంటి restrictions ఇప్పుడేమీలేవు. Border areas లో వున్న restrictions కూడా చాలా వరకు తీసివేశాము. ప్రత్యేకంగా ఎవరికైనా ఏమైనా యిబ్బందులు వుంటే వాటినికూడా తొలగిస్తాము.

**Sri T. Nagi Reddi** :—మనరాష్ట్రంలో బోర్డరు తాలూకాలలో కొన్ని గ్రామాలలో కొందరికి భూములు ఆంధ్రదేశంలో వుండి వారి నివాసం మాత్రం ఇతర రాష్ట్రంలో వున్న విషయం ప్రభుత్వానికి తెలుసు. వారు తమ భూముల్లో సాగుచేసుకున్న పంటను వారి గ్రామాలకు తీసుకుపోవడానికి అభ్యంతరాలున్నట్లుకూడా ప్రభుత్వానికి తెలుసు. కాని ఆవిషయంలో ప్రభుత్వం ఏమి ఆలోచిస్తున్నది? నాకు తెలిసున్న ఒక బోర్డరు గ్రామంలో భూములకు, భూస్వాముల గ్రామానికి మధ్య ఒక చిన్న కాలువ అడ్డుగావుంది. కాలువకు అటువైపువారి గ్రామము మైసూరు రాష్ట్రానికి చెందివున్నది, వారి భూములు కాలువకు ఇటువైపు ఆంధ్రరాష్ట్రంలో వున్నాయి. ధాన్యం భూమినుంచి తీసుకుపోవడానికి వారు చాలా యిబ్బందులు పడుతున్నారు. వారికేటువంటి యిబ్బందులు లేకుండా వుండడానికి ప్రభుత్వం తోడ్పడుతుందా ?

**The Hon. Sri K. Koti Reddi** :—తప్పకుండా తోడ్పడుతుంది వ్యాపారస్థులు కొందరు ఒకరాష్ట్రంనుంచి మరొక రాష్ట్రానికి బోర్డరు ప్రాంతాలలో లాభాలకోసం తీసుకుపోతూవుంటారు. ప్రత్యేకంగా అటువంటి వాటిని అరికట్టడంకోసం కొన్ని restrictions పెట్టాము. ఎక్కడైనా మీరు చెప్పిన లాంటి చినచిన్న యిబ్బందులుంటే తప్పకుండా సహాయంచేస్తాము.

**Sri G. Latchanna**:--అధ్యక్షా, ఒరిస్సా సరిహద్దు గ్రామాలలో ఆంధ్రపౌరులకు ఒరిస్సా గ్రామమాలలోను, ఒరిస్సా పౌరులకు ఆంధ్ర గ్రామాలలోను భూములుండి వారు వారివారి పంటలను భూములనుంచి తెచ్చుకోడానికి యిబ్బందులు పడుచున్నట్లు ప్రభుత్వానికి విజ్ఞప్తులు

22nd February 1954]

పంపారు. ఇటువంటి అసౌకర్యాలు తొలగించడానికి ఒరిస్సా ప్రభుత్వానికి వ్రాసి వారితో సంప్రతింపులేమైన జరిపారా ?

**The Hon. Sri K. Koti Reddi** :-ఆ విధంగా తీసుకుపోదలచిన వారికి పర్మిట్లు యివ్వవచ్చు. ఒరిస్సా ప్రాంతంనుంచి మన రాష్ట్రంలోకి తెచ్చుకోవాలంటే ఆ ప్రభుత్వం పర్మిట్లు యివ్వాలి. ఒరిస్సా ప్రాంతం నుంచి తెచ్చుకోదలచిన వారి విషయమై మానోటీసులోకి ఏమీరా లేదు. అటువంటి యిబ్బందులేమైనావుంటే తప్పకుండా చూస్తాము.

**Sri B. Krihnamurty Rao** :— ఆంధ్ర, మైసూరు సరిహద్దు ప్రాంతాల విషయంలో చిత్తూరుజిల్లాలో ఒక తాలూకానుంచి వేరొక తాలూకాకు ధాన్యం రవానా కాకూడదని వ్యవసాయదార్లు కూడా ఒక గ్రామంనుంచి వేరొకగ్రామానికి ధాన్యం తెచ్చుకోకూడదని ప్రభుత్వం కొన్ని నిబంధనలు తయారుచేసింది. దీనివల్ల ఎక్కడిధాన్యం అక్కడ నిలిచిపోవడము, జిల్లాలో సరిగా ధాన్యం దొరకకపోవడము జరుగుతోంది. ఈ విషయంలో ప్రభుత్వం తగిన ఉత్తర్వులు చేస్తారా ?

**The Hon. Sri K. Koti Reddi** :— ఇదివరకే నేను చెప్పినట్లు ఒకతాలూకానుంచి వేరొక తాలూకాకు ధాన్యం పోకూడదనే నిబంధన లేదు. Belt area లో మాత్రం కొన్ని నిర్బంధాలు smuggling ను ఆపుచేయడానికి పెట్టాము. ఇప్పుడు వాటెనికూడా తీసివేశాము.

**Sri B. Krishnamurty Rao** :— ఒక తాలూకానుంచి వేరొక తాలూకాకు ధాన్యం రైతులెవరూ కూడా తెచ్చుకోకుండా కలెక్టర్లు అభ్యంతరాలు చెపుతున్నారు. దీనివల్ల ప్రజలు చాలా యిబ్బందులు పడుతున్నారు.

**The Hon. Sri N. Sanjeeva Reddi** :— యిబ్బందులు గమనించే వాటిని తగ్గించడానికి కలెక్టర్ల conference లో ఆలోచించి ఆ చట్టాన్ని రద్దుచేశాము. కాబట్టి ఇంక అటువంటి యిబ్బందులేమీ వుండవు.

**Sri R. Siddanna Gowd** :— నేను Belt area లో వున్నవాణ్ణి గనక ఉపప్రశ్న వేయడానికి అవకాశం యివ్వమని అడుగుతున్నాను.

**Mr. Speaker** :--If necessary, the hon. Member may put a fresh question or give notice if a short-notice question.

[22nd February 1954

*Legislature Library*

*127 Q.—Sri M. Veerabhadram: Will the Hon. the Deputy Chief Minister be pleased to state —

(a) whether the Legislature Library of the composite Madras State was divided between Andhra and Madras; and

(b) if not, the proposals of the Andhra State Government to get the due share of the Andhra State from that Legislature Library?

The Hon. Sri N. Sanjeeva Reddi:

(a) No, but about 2,600 volumes consisting of reference books, general books, reports, copies of proceedings etc. were received from the Library of the Composite State.

(b) The Government have to consider this question along with the division of assests and liabilities.

(a) అవును. కాని 2,600 పుస్తకాలు మాత్రం reference, general పుస్తకాలు మద్రాసు అసెంబ్లీ సెక్రటరియేట్ నుంచి పంపబడ్డాయి. (b) ఇంకా మనకి రావలసిన బాకీపుస్తకాల విషయమై ఆస్తిపాస్తుల పంపకం పరిష్కారం అయినప్పుడు చూస్తాము.

Sri V. Srikrishna:—మద్రాసు ఉమ్మడిరాష్ట్రంలోని లైబ్రరీలో వున్న మొత్తం పుస్తకాల సంఖ్య ఎంత? ఇందులో మనకు వచ్చిన గ్రంథాలు 2600. ఆ వచ్చినవాటిలో ముఖ్యమైన తెలుగు గ్రంథాలు ఇక్కడకు తీసుకువచ్చే ప్రయత్నం వున్నదా? పంటచేను వారికి వదలి తిరిగి తెచ్చుకోకుండా వుంటారనే హామీ వుందా? పంటచేలను విడిచిపెట్టి చవిటినేలను పట్టుకున్నట్లు మంచి మంచి తెలుగు గ్రంథాలుకూడా విడిచిపెట్టిరావడం ఏమీ బాగాలేదు. దీనిమీద ప్రభుత్వం ఏమిచర్య తీసుకోదలిచింది?

The Hon. Sri N. Sanjeeva Reddi:—మనం తెచ్చుకున్న పుస్తకాలలో ఎక్కువ పుస్తకాలు రిఫరెన్సులకోసమే. మద్రాసు అసెంబ్లీలోవున్న 15000 పుస్తకాలలో రిఫరెన్సుకు పనికివచ్చేవి మనకు 400 పుస్తకాలు మాత్రమే. Duplicate కాపీలువున్న వాటినే మనకు

వారిచ్చారు. ఇక్కడ మనకు కావలసిన అత్యవసర పుస్తకాలకు అవరమైన డబ్బు రూ. 20000 మంజూరుచేశారు.

**Sri T. Nagi Reddy**:--మద్రాసు ఉమ్మడిలైబ్రరీలోవున్న 15000 గ్రంథాలలోను మనకు వచ్చినవి 400 మద్రాసులో అసెంబ్లీ లైబ్రరీ, కన్నెమెరాలైబ్రరీ ఇంకా వీధి వీధికీ ఎన్నోలైబ్రరీలున్నాయి. అటువంటప్పుడు కనీసం ఆంధ్ర అసెంబ్లీకిముఖ్యావసరమైన పుస్తకాలుకూడా మనకి యివ్వకపోవడం చాలా అన్యాయం. మద్రాసు ప్రభుత్వానికి ఆంధ్ర ప్రభుత్వం తెలియజెప్పి వారిదగ్గరనుంచి వీలైనన్ని ఎక్కువ పుస్తకాలు తీసుకురావాలని మా అభిప్రాయం. ఆంధ్రప్రభుత్వం ఈవిషయంలో ఏమిచర్య తీసుకుందని అడుగుతున్నాము.

**The Hon. Sri N. Sanjeeva Reddi**:--ఆంధ్ర అసెంబ్లీ feelings expressచెయ్యడానికి ఆస్తిపాస్తులుపంచుకునేటప్పుడు అవకాశంవుంటుంది. అదికాక ఎవరో ఒకరు కొన్నిపుస్తకాలు కొనుక్కో వలసిన అవుసరం ఎప్పుడూవుంది. అక్కడవున్నవి మనం తెచ్చుకుంటే వారుకొనుక్కోవాలి. లేకుంటే మనంకొనుక్కోవాలి. అందులోనూ వారి స్వాధీనంలో వున్న పుస్తకాలు మనంతెచ్చుకోవడం కొంచెం కష్టమైనపనే. కాబట్టి మనం కొనుక్కోవడం తప్పదు. మనం పుస్తకాలు తెచ్చుకో గలిగితే సంతోషమే. మనకు కావలసిన కొన్ని ముఖ్యమైన పుస్తకాలు కొనుక్కోడానికి రు 20,000/-శాంక్షను చేశాము.

**Sri Vavilala Gopalakrishnayya** :—మద్రాసు ప్రభుత్వంవారు మనవాటాకు యివ్వవలసిన మొత్తం గ్రంథాలెన్ని? ఎన్నియివ్వడానికి వారంగీకరించారు? మనకెన్ని ఇప్పుడిచ్చారు? ఈ విషయమై రాజగోపాలాచారిగారిని అడిగినప్పుడు ఆంధ్రరాష్ట్ర విభజన సందర్భంలో యిస్తామన్నారు. చివరికి వారిచ్చిన పుస్తకాలు 400. కేంద్రప్రభుత్వం విభజన సందర్భంలో ఏమైనా తగాదాలువస్తే మాకువ్రాసుకుంటే మేము చూస్తామన్నారు? వారికి మీరీ విషయం తెలియ జేశారా? తెలియజేస్తే వారేమి చర్య తీసుకున్నారు?

**The Hon. Sri N. Sanjeeva Reddi** :--కేంద్ర ప్రభుత్వానికి మనం తెలియపర్చవలసిన విషయాలు ఇదొక్కటేకాదు - ఇంకా చాలా వున్నాయి. మద్రాసు ప్రభుత్వానికీ మనకీ పరిష్కారం కావలసిన పెద్ద సమస్యలతో పోల్చిచూస్తే ఇదొక చిన్న సమస్య. వాటినన్నింటిని ఢిల్లీకి తీసుకు పోతున్నాము.

[22nd February 1954

Sri K. Rajagopala Rao :--అధ్యక్షా, చిన్న విషయాలలోనే ఇంత అన్యాయం మనకి జరిగినప్పుడు పెద్దవిషయాలలో ఇంకా ఎంతఎక్కువ అన్యాయాలు మనకి జరిగాయోనని అనుమానం వేస్తోంది. పుస్తకాలలో డూప్లికేట్ కాపీలు వున్నవాటికి మనకు ఒకకాపి యిచ్చారంటున్నారు. డూప్లికేట్ కాపీలు వున్నవాటిలోనే కూడా మనకుచాలా ఇవ్వలేదు. వాటినీ మనవాటాకు రావలసిన ఇతర పుస్తకాలనూ తెప్పించడానికి ప్రభుత్వం పూనుకుంటుందా ?

The Hon. Sri N. Sanjeeva Reddi:-మనకు రావలసిన వన్నీ తెచ్చుకోడానికి కావలసిన ప్రయత్నాలన్నీ చేస్తాము.

Sri Pillalamarri Venkateswarlu :--Duplicate కాపీలు తెచ్చామంటున్నారు. కాని కనీసం లైబ్రరీలో మాకు ముఖ్యమైన రిఫరెన్సులకు కూడా కావలసిన పుస్తకాలు లేవన్నసంగతి డెప్యూటీ ముఖ్యమంత్రిగారికి తెలుసా ? మద్రాసు ప్రభుత్వానికి కావలసిన పుస్తకాలు అసెంబ్లీ లైబరీలోనే కాకుండా ఇతరలైబ్రరీలలో కూడా వున్నాయి. కాబట్టి మనకు అధమం references కు కావలసిన పుస్తకాలైనా తెప్పిస్తారా ?

The Hon. Sri N. Sanjeeva Reddi:-మీకు ఏ ఏ Acts కని పించడం లేదో చెపితే వాటిగురించి వారినిఅడుగుతాము, లేదాకొంటాము.

Sri K. Krishna Rao:--కొన్ని administration reports immediate reference కోసము కావలసివున్నవి. అవి ఇక్కడ లేవు. ఉదాహరణకు Board of Revenue reports ఒకటీ లేదు. అవి Government of Madras ను అడిగాము. Reminders పంపిస్తున్నాము. అంటున్నారు. అవిలేక పోతే చాలా ఆటంకం కలుగుతుంది. అవిఅన్నీ, కనీసం Board of Revenue reports ఒక పది సంవత్సరాలవైనా తెప్పించడానికి తీవ్ర మైన ప్రయత్నాలు చేయాలని అడుగుతున్నాను.

The Hon Sri N. Sanjeeva Reddi :--Reference books' reports వచ్చాయి. రానివాటికి ప్రయత్నాలు చేస్తున్నాం. జవాబులు రాకపోతే ఇంకా వత్తిచూస్తాము.

Mr. Speaker:--Question hour is over.

The rest of the questions will be printed in the proceedings.

*Minor Irrigation Tanks in Nellore District.*

* 128 Q—Sri S. Vemayya:--Will the Hon. the Minister for Land Revenue be pleased to state—

(a) the number of Minor Irrigation Tanks that have been breached during the last fortnight of October, 1953 in Nellore District; and

(b) whether any report was submitted by the Collector of Nellore in the matter?

The Hon. Sri K. Koti Reddi :—

(a) 152 Minor Irrigation Tanks had breached due to heavy rains in October, 1953 in Nellore District.

(b) Yes. The Collector of Nellore has applied for an allotment of Rs. 2 lakhs for carrying out repairs to the Minor Irrigation sources and the Government have sanctioned this allotment.

(Note: An asterisk at the commencement of a speech indicates revison by the Member)

## BUSINESS OF THE HOUSE

Sri G. Latchanna:--అధ్యక్షా, శాసనసభా కార్యక్రమం గురించి వివరంగా తెలియకుండా వున్నది. ఈరోజు subject House లోనికి వస్తేనేకాని తెలియలేదు. రేపు, ఎల్లుండి అవతల ఎల్లుండి కనీసం మూడురోజులు ముందుగా సభాకార్యక్రమాన్ని తెలియజేస్తారా అని అడుగుతున్నాను.

Mr. Speaker:—It will be considered.

## PRIVILEGE MOTION RE: USE OF THE ASSEMBLY HALL

Sri Vavilala Gopalakrishnayya :—నేను ఈ Privilege Motion ను ఉపపాదిస్తున్నాను.

"That the Assembly Hall was given for holding the meeting of the officers of the Government and thereby affects the privileges of the House and that the matter may be referred to the Privilege Committee."

ఈమధ్యన అధికారుల సమావేశమొకటి ఈ హాలులో జరిగింది. శాసనసభా హాలులో ఇతర సమావేశాలు జరుగవు. చిన్నచిన్న కమిటీల మీటింగులుకూడా ప్రక్కగదుల్లో జరుపుకుంటారు. పత్రికల్లో చూస్తే శాసనసభా హాలులో District Collectors' meeting జరిగిందని తెలుస్తుంది. పత్రికల్లో వచ్చిన వార్త తప్పు అంటే అభ్యంతరం లేదు. ఇక్కడే సమావేశం జరిగియున్న పక్షంలో House గౌరవం భంగపరచడం అవుతుంది.

Mr. Speaker: This motion will be taken up tomorrow.

## PRIVILEGE MOTION RE : PROHIBITION ENQUIRY COMMITTEE.

Sri M. Bapayya Chowdary: Sir, I move :—

"That when Prohibition has been entrusted to a Committee of experts for enquiry and report, the Deputy Chief Minister has made speeches regarding Prohibition affecting the privileges of Members and the same may be rcferred to the Privileges Committee."

అధ్యక్షా, మద్యపాన నిషేధచట్టం అమలు పర్యవసానాన్ని గుర్తించడానికి పెద్దలైనవారితో కమిటీని ఏర్పాటుచేసి, వారు తీవ్రమైన చర్చలు జరుపుతుండే సందర్భంలో గౌరవనీయులైన ఉపముఖ్య మంత్రిగారు దానికి వ్యతిరేకమైన సభల్లో చర్చించవలసిన అనేక అంశములను గురించి అనేకమైన Speeches యిచ్చారు. ఇందువల్ల ఈసభాసభ్యుల మర్యాదకు భంగం కలుగుతుందని నేను తెలియచేస్తున్నాను.

Mr. Speaker:—This Motion also will be taken up tomorrow. I shall decide tomorrow whether I am allowing these motions or not.

## MOTION UNDER RULE 48 (1) RE : WANT OF CONFIDENCE IN THE MINISTRY.

Sri Pillalamarri Venkateswarlu:-Rule 48 (1) క్రింద నేను ఒక Notice పంపించినాను. అందులో

The motion is :

"This Assembly disapproves the policy of the Ministry in respect of District Boards as the Government had failed to make arrangements for conducting elections to the District Boards as per the provisions of the Madras District Boards (Amendment) Act, 1953 (Madras Act V of 1953.)" మంత్రి వర్గం పాలసీని disapprove చేస్తున్నాం అని తెలియ చేసినాను. Rule 48 క్రింద Notices వస్తే question hour తరువాత ఆవిషయం take up చేయాలి అని rules చెబుతున్నవి. అది take up చేయనిదే Government business కూడా చేయడానికి వీలులేదు. నేను దీన్ని సకాలంలో సరియైన form లో ఇచ్చాను.

Mr. The Speaker:—I will consider whether this motion is in order or not, and take it up tomorrow.

Sri Pillalamarri Venkateswarlu:-ఇదిOrderలో లేకపోతే త్రోసి వేయడానికి మీకుహక్కువున్నది. దీనియొక్క ప్రాముఖ్యతను బట్టికూడా

ఇప్పుడే take up చేయవలసి వున్నది. దీనిని ఎందుకు press చేస్తున్నామంటే, accept చేస్తే తిమ్మారెడ్డిగారు Bill move చేయనక్కరలేదు.

Mr. Speaker :—There is another thing; hon. Members can defeat the Bill itself and then it may be unnecessary to move this motion.

Sri Pillalamarri Venkateswarlu :—ఒక particular policy వ్యవహారంలో ప్రభుత్వవిధానాన్ని మేము disapprove చేస్తున్నాం అని చెబుతున్నాను. Merits లోనికి నేను వెళ్లడంలేదు. ఇంతకుపూర్వం ఒక Act వున్నది. అది ఎంతవరకు అమలు జరిపినారు ? ఎందుకు అమలు జరుపలేదు ? మార్చి 31 నాటికి ఎలక్షన్లు పూర్తిఅయి Presidents రావాలని అంటే దాని Gazette Publication కావాలి, nominations జరగాలి. తరువాత ఎలక్షన్లు జరగాలి. దానికి ఎంతకాలంపడుతుందో ఆలోచించకుండా ఏవిధంగా అమలులోవున్న శాసనాలనే ప్రభుత్వం ఏలానిర్లక్ష్యం చేస్తున్నది, మేముప్రభుత్వాన్ని censure చేస్తున్నాం. దీనికి ఒకప్రాముఖ్యత వున్నది. ఈతీర్మానాన్నిముందు consider చేస్తేనే కానిమిగిలిన government business take up చేయటానికి రూల్సు ప్రకారంమాత్రంవీలుకాదని నేను మనవి చేస్తున్నాను.

Mr. Speaker :--I find one difficulty to immediately consider this motion. Under Rule 48 (2), if I hold that the motion is in order, I shall have to take the sense of the House and see whether it gives the leave. For giving this leave, under the existing rule, 75 members will have to rise in their places. But this rule fixing 75 as the member was made by the Composite Madras Assembly. We have not as yet altered it. If therefore the hon. Member is not prepared to allow me time to amend the rule, I have no objection to stick to that number. The motion was handed over to me at 10-45 or 10-50.

Sri Pillalamarri Venkateswarlu:--That is not my fault.

Mr. Speaker :--It may be anybody's fault. The position is the same. I have to think over the matter and give my ruling. I will therefore take it up tomorrow.

Sri Pillalamarri Venkateswarlu :-- మీరీమాటలు కొత్తకాదు ఎందుచేతనంటే 375 సభ్యులలో 75 అంటె 1/5 వంతు. అంటే 20 per cent మాత్రం. పార్లమెంటులో 500 సభ్యులకు 50 సభ్యులువుంటే సరి

పోతుంది. అది అట్లావుండగా House of Commons లో Leader of the Opposition Censure Motion తీసుకువస్తే ఎట్టి అభ్యంతరం లేకుండా అంగీకరించడం వెంటనే సకాలంలో చర్చకు పెట్టడం సాంప్రదాయం. మనయొక్క అసెంబ్లీ సాంప్రదాయాలు వేరే సాంప్రదాయాలు వ్రాసుకునేంతవరకు House of Commons సాంప్రదాయాన్ని అనుసరించాలని Constitution లో వున్నది. ఎట్లా చూచినప్పటికైనాసరే యింతమంది ఒప్పుకున్న point కూడా సరైనదని ఒప్పుకోక తప్పదు. 375 సభ్యులలో 1/5 వంతు అయిన 75 మంది సభ్యులు అభ్యంతరాన్ని అంగీకరించి motion ను చర్చకు తీసుకురావడం పార్లమెంటరీ సాంప్రదాయం.

Mr. Speaker: If you can defeat the Government today, you can equally defeat the Government tomorrow. Supposing the Bill is allowed to be introduced to-day and is passed. That means that the majority wants the Bill and is against the Censure Motion impliedly. If the hon. Member still wants, he can censure the Government tomorrow.

Sri Pillalamarri Venkateswarlu :-- పార్లమెంటరీ సాంప్రదాయం అంగీకరించినట్లైతే opposition చెప్పినట్లు ప్రభుత్వం చేసినది తప్పు అని censure చేసినప్పుడు, opposition party కోరుతున్నదాన్ని అంగీకరించడం సరియైన పద్ధతి. వాళ్లు opposition party లో కూర్చున్నారని కాక పార్లమెంటరీ practice దృష్టిలో పెట్టుకుని చూచినట్లయితే యీ motion ను చర్చించడానికి అభ్యంతరం వుండకూడదు. Quorumఎంత వుండాలో తరువాత ఆలోచించి నిర్ణయంచేసుకోవచ్చు. దానికి అభ్యంతరం లేదు. కాని యీ రోజున Leader of the Opposition కోరినట్లు government party అంగీకరించడం సాంప్రదాయం కనుక వెంటనే మేము సూచించినది అంగీకరించి మా యీ motion discuss చేయుటకు accept చేయడమే సరైనదని Parliamentary traditionsకు అనుకూలంగా ruling యివ్వమని కోరుతున్నాను.

Mr. Speaker: The Hon. Minister for law will please speak.

The Hon. Sri T. Viswanatham:—48 rule సరిగా అర్థం చేసుకోవాలి. 48 rule policy మీద disapproval గురించి మామూలుగా Budget కు notice యిచ్చినతరువాత బిల్లులో చర్చించివలసిన

విషయాలు House ముందు వచ్చినపుడు మామూలుగా దానికి సంబంధించిన యితర విషయాలు ఎట్లాగూ చర్చకు వస్తాయి. దీన్ని Rule of Anticipation అంటారు. క్రొత్తగా Bill introduce చేస్తున్న సమయములో యిట్టి తీర్మానం వచ్చినట్లయితే అది సాంప్రదాయ విరుద్ధం. Bill చర్చించేటప్పుడు వ్యతిరేకపక్షమువారు ప్రతిఘటించవచ్చుననీ substantial disapproval తెలియపర్చడానికి Bill ను defeat చేయడమే అవకాశం అనీ తమరు శలవు యిచ్చారు. Bill చర్చకు సిద్ధంగా వున్నప్పుడు తిరిగి మరొక disapproval motion పెట్టడం తప్పుడుసంగతి. Presentation కు సిద్ధంగా వున్న బిల్లులోని policy గురించి anticipation గా యితరవిషయాలుచర్చించడానికి వీలులేదు. Adhoc Committee లో మెంబర్ల సంఖ్య నిర్ణయం చేస్తారు. సంఖ్య విషయంలో అభ్యంతరాలుండనవసరంలేదు. ఇప్పుడు ఈ Bill గత Bill కాలము expire అయేలోగా Bill బాగోగులను చర్చించడానికి అవకాశం వుండటానికే తీసుకురాబడింది. ఒక Bill కాలము పరిమితము చేయబడినపుడు దాని సాధకబాధకములను ఆ కాలపరిమితి తరువాత చర్చించడానికే వుద్దేశించబడింది. Poilcy చర్చించడానికి అవకాశం యివ్వడంకోసం యీబిల్లు వుద్దేశం. అని మనవిచేస్తున్నాను. Rules ప్రకారం చర్చ సందర్భంలో యీ policy కి వ్యతిరేకంగా మాట్లాడవచ్చును, "With the consent of the Speaker" చేయవచ్చును. కనుక నేనుచెప్పిన కారణాలవల్ల Speaker గారు consent యివ్వకూడదని మనవి చేస్తున్నాను.

Sri Pillalamarri Venkateswarlu:--Sir, On page 290 of May's Parliamentary Practice, it is stated :

"By established convention the Government never fail to accede to a demand from the Leader of the Opposition to allot a day for the discussion of a motion expressing lack of confidence in the Government - a'Vote of Censure' as it is called. In allotting a day for this purpose the Government are entitled to have regard to the exigencies of their own business, but a reasonably early day is invariably found. Few sessions fail to provide example of such motions."

Vote of Censure Government accede చేయాలని concede చేస్తున్నది. విశ్వనాధంగారు యింకో point అసందిగ్ధంగా చెప్పారు. With the consent of the Speaker motion orderలో వుంటే allow

[Sri Pillalamarri Venkateswarlu] [22nd February 1954

చేయవచ్చును. House of Parliament లో Madras అసెంబ్లీలో తప్పనిసరిగా ఈ విషయమే press చేయవలసిన అవసరం ఉన్నది. వెను కటినసమావేశంలో కూడా ప్రశ్నలకాలంలో యీ subject మీద మీ definite policy ఏమిటని మేము అడుగుతూనేవచ్చాం. ఈ బిల్లు అప్పుడు ప్రవేశపెట్టబడి నట్లయితే మేమీ motion press చేసి వుండే వాళ్లంకాము.

12-20 P.M. Sri Pillalamarri Venkateswarlu:-అధ్యక్షులు motion order లోవున్నదా లేదా అనే విషయముమాత్రమే decide చేయవలసి వున్నది. Motion order లో వున్నపుడు దానిని చర్చకు పెట్టడానికి ఎట్టి అభ్యంతరము వుండరాదు.

Rule 49 (2) says:

"If the Speaker is of opinion that the motion is in order, he shall read the motion to the House and shall request those Members who are in favour of leave being granted to rise in their places and if not less than 75 members rise accordingly, the Speaker shall intimate that leave is granted and that the motion will be taken on such day, not being more than ten days from the day on which leave is asked for, as he may appoint. If less than 75 members rise, the Speaker shall inform the member that he has not the leave of the House".

Again Rule 48 (b) says:

"the member asking for leave must, before the commencement of the sitting of the day, leave with the Secretary at written notice of the motion which he proposes to make". మన ఎదుటవున్న రూల్సు వ్రాతలనుబట్టి చూస్తే యీ motion ను చర్చకు పెట్టడానికి వీలువుంది. Government ను censure చేయడానికి ఉద్దేశింపబడిన యీ మోషన్ ను అధ్యక్షులు admit చేయాలని కోరుతున్నాను. Government పక్షమువారు బిల్లును ప్రతిపాదించక ముందు motion ను చర్చించడానికి అవకాశము యివ్వకూడదన్నారు. Motion ను చర్చించడానికి వారికి ఎందుకు అభ్యంతర ముండాలో నాకు అర్థము కావడములేదు. కనుక యీ motion ను చర్చకు పెట్టాలని అధ్యక్షులను కోరుతున్నాను.

Sri K. Krishna Rao:--అధ్యక్షా! Rule of Anticipation యీ case లో వర్తించదు. ప్రభుత్వం ఇప్పుడున్న Act ను సక్రమముగా నెర

వేర్చినారా లేక నెరవేర్చలేకపోయినారా అనేదే ఇప్పుడున్న సమస్య. ఇప్పుడు ప్రభుత్వము ప్రతిపాదించబోవు బిల్లు వారు నెరవేర్చలేకపోయిన Act ను కప్పిపుచ్చుటమనే నాకర్థమౌతుంది. ఇంతకుమునుపు మద్రాసు అసెంబ్లీలోను, పార్లమెంటులోను Question hour కాగానే opposition పక్షముచే తేబడిన motions ఈ చర్చకు తెచ్చిన సందర్భాలు ఎన్నియో వున్నాయి. కనుక యీ motion ను చర్చకు పెట్టడానికి తగువైన Ruling యిస్తారని కోరుతున్నాను.

Mr. Speaker :-I can give my finding on this question only tomorrow. We shall now go to the next item.

The Hon. Sri T· Viswanatham :-- బిల్లును ప్రతి పాదించక మునుపే మోషన్‌ను చర్చకు తెచ్చిన ఎడల, Leader of the Opposition censure తో తెచ్చిన బిల్లును మేము ప్రతిపాదించు తున్నామన్న మాట. Government కు తమ business సక్రమముగా జరుపు కొనుటకు కొన్నిహక్కులు ఏర్పడ్డాయి. ఇటువంటి motion లతో కూడుకున్న అడ్డంకులు వచ్చినపుడు ప్రభుత్వ business ఏ మాత్రము జరుగదు. కనుక యీ మోషన్‌ను allow చేయ కూడదని కోరుతున్నాను.

Sri T. Nagi Reddi :--He is misrepresenting.

The Hon. Sri T. Viswanatham :-మీరు చాలహెచ్చుగా మాట్లా డుతున్నారు. నేను మాట్లాడేది బాగుగా శాంతంగా విని అర్థముచేసు కోవాలని కోరుతున్నాను.

Sri M. Hanumantha Rao :--ఇది మీకు కూడ వర్తించునా ?

Mr. Speaker: The conduct of the hon. Member in sitting and talking will be brought to the notice of the House. The conduct of the hon. Member cannot be approved. But as this is the first time I do not want to take any action. The hon. Member will please note that there must be a sort of decorum that must be observed in the House.

Sri M. Hanumantha Rao : (Interruption)

Mr. Speaker : Again I bring the conduct of the hon. Member to the notice of the House. If for the third time he repeats it, he will be expelled from the House.

Sri K. Rajagopala Rao:-అధ్యక్షా, ఇదివరలో యీలాంటి వ్యవహారాలు జరిగినపుడు సరియైన శ్రద్ధతీసికొని వున్నట్లైతే యీ లాంటి

[Sri K. Rajagopala Rao] [22nd February 1954]

వాటికి ఆస్కారము వుండేదికాదు. ఇదివరలో అనేకసార్లు సభ్యులు కూర్చొని మాట్లాడిన కూడ ఎట్టి అభ్యంతరము తెలుపనందున యీ చిక్కులు ఎర్పడ్డాయి.

Mr. Speaker: If hon. Members want this sort of rights and conventions to be built up, it means that there will be no order in the House.

Sri T. Nagi Reddi :-అధ్యక్షా, నేను, ఒకవిషయాన్ని మనవి చేస్తున్నాను. గత 2 సంవత్సరముల అనుభవములో మద్రాసులోగాని, ఇక్కడకు వచ్చిన తరువాతగాని చర్చలలో అప్పుడప్పుడు interruptions కూర్చొనిచేస్తూండడం అక్కడ చూశాము, ఇక్కడా చూస్తున్నాము.

Mr. Speaker :---If it is only an interruption of the hon. Member, I have no objection, but it is an aspersion against the Chair.

Sri T. Nagi Reddi :---Aspersion కాదండీ, మీరు ఇచ్చినటువంటి రూలింగు అవతలవారి దృష్టికి తీసుకురావడమేగాని, మీామీద aspersion చేయడానికి ఎవరూ పూనుకోవడంలేదు, కనుక మీామీద aspersions చేస్తున్నామని మీారు భావిస్తున్నందుకు చాలా నొప్పి పడుతున్నాను. ఇదివరకు across the table మాట్లాడకూడదు అని ఖచ్చితంగా ఎప్పుడు మీారు ప్రత్యేకంగా చెప్పలేదు. కనుక తటాలున ఇప్పుడు ఒకేసారి కోపముచేసుకొనుట భావ్యంగాదని మనవిచేస్తున్నాను. across the table talks ఉండకూడదు అని ఖచ్చితంగా చెప్పినట్లైతే ఆవిధంగా నడచుకొంటాము గాని ఇది aspersion గా భావించడం తగదని మనవిచేస్తున్నాను.

* Sri M. Hanumantha Rao :-అధ్యక్షా, నేను మాట్లాడుచున్నటువంటి విషయాన్ని మీారు ఆ spirit లో తీసుకోవడం చాలా విచారకరమైనటువంటిది. ఇక్కడ ప్రత్యక్షంగా మన ఆర్థిక మంత్రిగారు మాట్లాడినప్పుడు, వారు కొన్ని పదాలను ఉపయోగించారు. ఆర్థిక మంత్రిగారు సూటిగా మమ్ములను మీారు అతిగా మాట్లాడవద్దు, కూర్చొండి అనేమాటలు ఉపయోగించారు. ఆ పదాలు ఇక్కడ ఉన్నటువంటి సభ్యుల గురించి అన్నట్లు స్పష్టంగా కనిపిస్తున్నది. ఆవిధంగా వారు మాట్లాడినప్పుడు మేము గూడ కొన్ని remarks pass చేయడం జరిగింది. కనుక మేము చెప్పింది మీాకు అన్వయిస్తుందని అధ్యక్షులవారు భావించడం సరికాదు.

22nd February 1954]

Sri K. Rajagopala Rao :--అధ్యక్షులవారు ఈ విషయంలో సభ్యుల వుద్దేశ్యమేమిటో ఇప్పుడు స్పష్టంగా గ్రహించారు. కాబట్టి ఇంతకు ముందు Aspersion Passచేసిన remarks ని, చేసిన హెచ్చరికలనూ record లో లేకుండా చేయాలని మనవి చేస్తున్నాను.

The Hon. Sri T. Viswanatham :—అధ్యక్షా! ఇదివరలో ఈ డిస్ట్రిక్టుబోర్డు బిల్లు ఏదో ఒక తేదీన సమాప్తము అవుతుందని ఉన్నది. దీనికి మరల కొంతకాలము కావాలని ఇప్పుడు ఈ బిల్లు ప్రవేశపెట్టబడు చున్నది. దీనిని చర్చించకముందే పాతబిల్లును ప్రవేశపెట్టినటువంటి ఉద్దేశ్యం నిరుపయోగమైంది, కనుక మీ పాలసీ మేము ఒప్పుకోనము, అని చెప్పడం సరియైనదికాదు. ప్రభుత్వముయొక్క పాలసీని discuss చేసేందుకే ఈబిల్లు అవకాశమిస్తున్నది. ఇదివరకుపాతబిల్లులో6 మాసములో, ఏడాదో ఈవిషయంలో గడువు ఇవ్వబడింది. ఆ కాలమును పొడిగించవలసియున్నది. అంటే ఈ విషయాన్ని చర్చించడానికి తిరిగి ఒక అవకాశము ఇవ్వడం జరిగింది. మరొక సంవత్సరం కాలం కావాలని ఈ బిల్లులో కోరుతున్నాము. ఈ సందర్భములో, ఇటుపైన time ఇవ్వమని ఎవరైనా వాదించవచ్చు, ప్రభుత్వ పాలసీని discuss చేయవచ్చు. అట్లుగాక దీనిని ప్రవేశపెట్టకమునుపే, ప్రభుత్వముయొక్క అభిప్రాయమును తెలుసుకొనకమునుపే ప్రభుత్వ పాలసీని మేము ఒప్పుకోకుంటే అసలు శాసనసభా కార్యక్రమం జరుగనే జరగదు. ప్రతిదానికి అదేవిధంగానే చెప్పవచ్చు. రేపు Budget ప్రవేశపెట్టేటప్పుడుకూడ ఆవిధంగా ప్రశ్నించి, ఇందులో ప్రభుత్వం పాలసీ ఏమీలేదని. దానిని censure చేయవచ్చు. ఈవిధంగా అయితే శాసనసభయొక్క కార్యక్రమం ఏదిగూడ జరగడానికి వీలుండదు. 48 వ రూలు ఏమి చెప్పుతున్నదంటే, ప్రభుత్వమువారు తమ పాలసీని discuss చేయడానికి అవకాశమివ్వకుండా తమ పద్ధతినే పోతూయుండినట్లైన, ప్రభుత్వ పాలిసీని ఈవిధంగా వ్యతిరేకించడానికి ఈ రూలు వర్తిస్తుందిగాని, ప్రభుత్వం తమ పాలిసీని discuss చేయడానికి అవకాశమిస్తున్నప్పుడు గాదు. ఈ బిల్లు ప్రవేశపెట్టడంలో అటువంటి అవకాశం ఇస్తున్నప్పటికి, "మీ పాలిసిని మేము ఒప్పుకోమని, మేము అందుకని ప్రత్యేకంగా ఒక తీర్మానం ఇచ్చామని" చెప్పినట్లైతే ఇది శాసనసభా కార్యక్రమానికే భంగంకలిగిస్తుందని నేను మనవి చేస్తున్నాను.

[22nd February 1954

*Sri Pillalamarri Venkateswarlu:-అధ్యక్షా! నేను ఒకచిన్న విషయం మనవిచేస్తున్నాను. విశ్వనాథంగారు ఈవిషయంలో ఈశాసన సభయొక్క business అంతాకూడ త్రోసివేసి, దీనిని తీసుకోవలసి యుంటుందనే విధంగా తమ అభిప్రాయాన్ని తెలియచేశారు. అసలు మేము అడుగుతున్నది మా తీర్మానము చర్చించుటకు House యొక్క leave కావాలని కోరాము. ఇంతకుముందున్న శాసనసభలో 375 మందిలో, leave ఇవ్వడానికి 75 మంది అనుకూలంగా ఉంటేచాలును. ఇప్పుడు ఇక్కడ రెండువిషయాలున్నాయి. మాతీర్మానం చర్చించడానికి leave ఇవ్వమనేది, తరువాత చర్చ ప్రారంభించడమనేది. ఇవి రెండును different aspects కనుక మొట్టమొదట మాతీర్మానం చర్చించుటకు House leave ఇస్తుందా లేదా అనే విషయముపైన వోటింగుపెట్టాలి. లీవు ఇచ్చినవెంటనే దీనిని చర్చకు తీసుకోవాలి. కనుక మేము notice ఇచ్చినదానికి House leave ఇస్తుందా లేదా అనేదాన్ని తెలుసుకోవలసి యుంటుంది. మేము notice ఇచ్చిన తరువాత దాన్ని 10 రోజులలో చర్చించాలి అని రూలుఉన్నది. 1949 లో మనకు నూతన రాజ్యాంగ విధానం వచ్చినతరువాత, ఈ రూల్సు మద్రాసు శాసనసభలో ఆమోదింపబడినవి. కనుక ఈ రూల్సు ఏదో 1926 లో గాని, 35 Act క్రింద గాని వచ్చినటువంటి రూల్సుకాదు. కాని ఇప్పుడువచ్చినటువంటి విషయం leave ఇచ్చి నంతమాత్రాన గవర్నమెంటు business అంతా ఆగిపోతుందని చెప్పడం సమంజసంకాదు. ఇది obstruction tactics క్రింద రాదు, policies కు దీనికి సంబంధంలేదు. గవర్నమెంటును నడపడంలో censure చేయదలచుకొన్నాము. అందుకోసమే ఈ తీర్మానం కొరకు leave అడుగుతున్నాము. దీనిని obstruction tactics గా భావించడం సరియైన పద్ధతికాదు. కనుక ఈవిషయాన్ని consider చేసి మీరు రూలింగుఇవ్వాలి. ఇదిorderలోదనివారుచెప్పుతున్నారు. కానిఇది order లోఉన్నదనే నేను విన్నవిస్తున్నాను.

Mr. Speaker :-Supposing I hold that the motion is in order and the House also gives its leave for the motion being moved. Can I prevent the Bill being moved by the Hon. Minister today ?

Sri Pillalamarri Venkateswarlu: No.

Mr. Speaker :-.Therefore, where is the hurry now and why not we consider the matter tomorrow ? In view of the

22nd February 1954] [Mr. Speaker]

objections raised by the Hon. the Law Minister, I would like to have time to consider the matter and cannot take it up just now, though I think that the motion is in order.

## Government Bills

### THE MADRAS DISTRICT BOARDS (AMENDMENT) ANDHRA AMENDMENT BILL, 1954 : INTRODUCTION OF THE BILL WITHOUT SUFFICIENT NOTICE

12-40 P.M.

Mr. Speaker :--The Hon. Minister will now move the Bill.

Sri M. Veerabhadram :--On a point of order, Sir, ఈ బిల్లును move చేయటానికి వీలులేదండి. కారణమేమంటే, ఎసెంబ్లీ రూల్సు 79(1) ప్రకారము " At any time after the expiry of six days from the date of publication of the bill " అని వున్నది. కాబట్టి యీబిల్లు యీనెల 19 వ తారీఖున publish అయింది. ఈ రోజున అనగా 22 వ తేదీన ప్రవేశపెట్టుతున్నారు. ఆరురోజుల గడువు కాలేదు గనుక యీబిల్లును ప్రవేశపెట్టడానికి అవకాశములేదు, దీనిమీాద మీారు ruling యివ్వాలని కోరుతున్నాను. గజెట్ పబ్లికేషనుకుగాను ప్రత్యేకించిన ఆరులోజులు గడువుతీరలేదు. At any time after the expiry of six days etc. etc. అని వున్నది. యీ బిల్లును యిప్పుడు ప్రవేశపెట్టడము అనేది రూల్సుకు విరుద్ధముగా వుంటుందిగనుక, యీ బిల్లును యిప్పుడు ప్రవేశ పెట్టగూడదని అంటున్నాను.

Mr· Speaker :--Under Rule 115 I have got the discretion to allow it at shorter notice and I am exercising the the discretion. That is why I have allowed it to be put on the agenda. Otherwise I would not have allowed.

Sri R. Siddanna Gowd :--On a point of information, అధ్యక్షా, ప్రభుత్వమువారు యిప్పుడు ప్రవేశపెట్టబోతున్న యీ District Boards కు సంబంధించిన బిల్లు విషయములో నేను నా ఆక్షేపణ చెబుతున్నాను. ఈ బిల్లు విషయములో సభ్యులకు యివ్వవలసిన due notice యివ్వబడలేదు. ఈ బిల్లు మన House పైన surprised గా spring చేయబడింది. దీని విషయములో రావలసిన amendments అన్నియు వచ్చిన తరువాత వాటినిగురించి చర్చించటానికి వ్యవధిలేదు. ఇటువంటి పరిస్థితులలో యీ బిల్లును యింతత్వరగా ప్రవేశపెట్టి pass చేయడము సమంజసమేనా అని అడుగుతున్నాను. మాసవరణలు అన్నియు యివ్వటానికి అధ్యక్షులవారైన మీారు మాకు వ్యవధి యిస్తారా ! ఈ విషయంలో మీా అభిప్రాయము తెలుపవలెనని విజ్ఞప్తి చేస్తున్నాను.

[22nd February 1954

Mr. Speaker :--The answer to this is contained in my answer to Sri Veerabhadram. No doubt Government have not given six days' time, but I have got the discretion to allow it. Amendments can be sent till 3 o' clock or even four.

* Sri Vavilala Gopalakrishnayya:-అధ్యక్షా, ఈరోజున యీ సమావేశం ప్రారంభమైందిగనుక, సభ్యులందరికి ఒకే నోటీసు వచ్చినట్లుగా భావించవలసియుంటుంది. తరువాత High Court విషయం ప్రవేశపెట్టబోతున్నారు. సభ్యులందరు యీ ఎసెంబ్లీలో కూర్చున్న తరువాత, బిల్లును ప్రవేశపెట్టటానికి నోటీసుకు టైము చాలదని ప్రశ్నిస్తే, నోటీసుకు టైము waive చేస్తాము అని అంటున్నారు. ఇదంతా చూస్తే బిల్లు గజెట్‌లో పబ్లిషు చేయడము, తరువాత ఒకేసారిగా సరాసరి యీ సభలో ప్రవేశపెట్టడము, యింత వ్యవధిలేకుండా యీ బిల్లును pass చేయడము సరియైన పద్ధతికాదని నా మనవి సభ్యులకు యివ్వవలసిన అయిదురోజుల వ్యవధిగూడా యివ్వబడడములేదు. అట్లా కాకుండా గజెట్‌లో వేయడం, సరాసరి యీ ఎసెంబ్లీలో ప్రవేశపెట్టడము జరుగుతున్నది. పబ్లికేషనుకు ముందు అయినను మాకు యీబిల్లును పంపించారా అంటే, అదీ, జరగలేదు. పోనీ, ఎసెంబ్లీ secretariat నుంచి అయినను మాకువచ్చిందా అంటే, అదీగూడ జరగలేదు. ఇంత హడావుడిగా introduceచేయడం సరికాదు. తరువాత హైకోర్టుకు సంబంధించిన resolution మాత్రం మాకుచేరింది కాని యీ House ముందుకు తెచ్చేరోజుకు దీన్ని గురించి ఆలోచించటానికి preparation టైము గూడా లేకుండా జరగబోతున్నది. ఈ Procedure అంతా ఏ రూలుక్రింద జరుపబోతున్నారో చూడాలి. దీనికి సంబంధించిన రూలులో వున్న anomaly నాకు అర్థం కావడములేదు. 208 వ శెక్షనుప్రకారము రూల్సు తయారుచేశామన్నారు. ఆరూల్సు ఎవరుచేశారు? ఆంధ్ర యాక్టులోని 45వ శెక్షనుప్రకారము ఉమ్మడి మద్రాసు రాష్ట్రములోవున్న పాత రూల్సు యీ ఆంధ్రస్టేటుకు, కొత్తగా రూల్సు ప్యాసుఅయి అమలులోకి వచ్చేవరకు, వర్తిస్తవి అని అంటున్నారు. కొత్తరూల్సు చేయబడినవి అన్నారు. ఆరూల్సుకు, వీటికి సంబంధంలేవు. ఇప్పుడు ఏరూల్సు వున్నట్లు? ఆతరువాత ఈ రూలు యీ శాసనసభకు ఏమాత్రముకూడా apply కానటువంటిగా వున్నది. దీనికి 75 మంది సభ్యులు కావాలని అన్నారు. 75 మంది సభ్యులను ఎక్కడినుంచి తీసుకొనిరాగలరు? 75

మంది సభ్యులను ప్రభుత్వపక్షముకూడా తీసికోనిరాలేదు, కాబట్టి యిటువంటి anomalies తో కూడిన రూలుతో ఎట్లాసాగిస్తారు. ఇది సరియైన procedure కాదు. చట్టము waive చేస్తాము, రూల్సు waive చేస్తాము అని అంటూాయున్నారు. Procedure గూడా waive చేస్తామని అంటున్నారు. అటువంటప్పుడు యీ శాసనసభలో discussion కూడా waive చేస్తే, కూడాచేయవచ్చునేమో. ఈ విషయాలన్నియు ఆలోచించవలసిన అవసరము వున్నది గనుక, నేను మిమ్ములను కోరేది యేమిటంటే, యీబిల్లుకు టైము యేమియులేకుండా తీసుకొచ్చి ప్రవేశపెట్టి Pass చేయుడము సరియైన పద్ధతికాదు. కాబట్టి, మాకువున్న హక్కులను మీరు రక్షించాలని కోరుతున్నాను. ఇప్పుడు యీ బిల్లుకు కాలసిన amendments అన్ని మొదటులోఎక్కించుకొని,ఆ amendments ఎప్పుడుమీాకు అందజేయాలనో తెలియకుండావున్నది. ఈ amendments ను అన్నిటిని సర్కు్యలేటు చేయడానికిగూడా వ్యవధిలేదు. ఇంత కొద్ది కాలములోనే, ఏవిలేకుండా సరాసరి యీబిల్లునుతీసుకొనివస్తున్నామంటే యీబిల్లును నెత్తినవేసుకొని పోవడమేనన్నమాట. ఇట్లా జరుగడము చాలాఅన్యాయం. మేమంతా యిక్కడినుంచి వెళ్ళిపోవటానికి అవకాశము కలుగుతున్నది. అందువల్ల మా హక్కులను భంగపరచకుండా రక్షించాలని కోరుతున్నాను. ఇప్పుడు మీరు తప్పకుండా waive చేస్తామంటే, యీ బిల్లును రేపటికి waive చేయుండి. అంతేకాని, యీ రోజున మాత్రం యీ బిల్లును తీసుకొనిరాకూడదని నా ప్రార్థన.

Mr. Speaker : I have considered all aspects. నేను యిప్పుడు సభవారికి వ్యవధిని యిచ్చి, గవర్నమెంటువారు యీ బిల్లును తీసుకొనివచ్చారా, లేదా అనేది నేను ఆలోచించుకోకపోలేదు. ఈ బిల్లుయొక్క స్వభావం యేమిటంటే, యీ date extend చేయుడం, చేయకపోవడం అనేది ఒక simple question. నాకు వున్న special power ను వినియోగించి నేను ఆ restrictions ను waive చేస్తున్నాను. Hon. Members యివ్వదలచుకున్న amendments అన్నియు యీ సాయంత్రము 3 గంటలవరకు యివ్వవచ్చును. కాకపోతే నాలుగు గంటలవరకుగూడా టైము యిస్తాను.

Sri M. Veerabhadram : రూలు 115 లో... ...

Mr. Speaker : Rule 115 says "The Speaker may, in his discretion, dispense with the provisions of this Chapter

regarding notice, periods of notice, or interval between any two stages of legislation, and may, in his discretion, allow any motion regarding a Bill or any amendment to be moved without notice, or after such shorter interval, as he may think fit". అని వున్నది. అందువల్ల నేను అన్నివిషయాలు consider చేశాను.

No further explanation please. I have already come to one conclusion, and I have given my finding. I stick to it. The Hon. Minister may move his motion.

** The Madras District Boards (Amendment)*

*Andhra Amendment Bill, 1954.*

12-50 P.M. The Hon. Sri P. Thimma Reddi :--Mr. Speaker, Sir, I beg to introduce the Madras District Boards (Amendment) Andhra Amendment Bill, 1954, and move that the Bill be taken into cosideration at once.

1-7-1953 వ తేదీన శ్రీకాకుళము, విశాఖపట్నము జిల్లాలుతప్ప, మిగతా జిల్లాల బోర్డులయొక్క term పూర్తిఅయింది. వెంటనే ఆజిల్లా బోర్డులకు Special Officers ను నియమించడం కూడ తెలిసిన విషయమే. తరువాత శ్రీకాకుళము, విశాఖపట్నము జిల్లాబోర్డుల యొక్క term పూర్తిఅవుతూనే అక్కడకూడ Special Officers ను యేర్పాటు చేయువలసి వచ్చింది. ఈ Special Officers యొక్క కాలపరిమితి విశాఖపట్నం, శ్రీకాకుళం జిల్లాలుతప్ప మిగతాజిల్లాలకు 1-7-53 నుండి, విశాఖపట్నం, శ్రీకాకుళం జిల్లాలకు 29-12-1953 నుంచి వచ్చింది. 1-10-1953న క్రొత్త state యేర్పాటు చేస్తున్నట్లే, యీజిల్లాబోర్డులకు సంబంధించిన బాధ్యతఅంతా ప్రభుత్వం మీాద యెక్కువగా పడినదనే విషయం యీ Assembly లో అప్పుడప్పుడు వచ్చిన ప్రశ్నలు రూపేణా, పత్రికలలో reported వ్రాతలరూపేణా అందరికి తెలిసిన విషయమే. ఇప్పటికప్పుడే జిల్లాబోర్డులు ఆర్థికంగా చాలబలహీన స్థితిలో వున్నవని మీా అందరకూ తెలివిషయమే. ఈ జిల్లాబోర్డులకు 1-10-53 నుంచి

| | |
|---|---|
| Chittor జిల్లాబోర్డుకు | రు. 50,000 |
| West Godavari జిల్లాబోర్డుకు | రు. 1,19,000 |
| Anantapur జిల్లాబోర్డుకు | రు. 1,55,000 |

* Vide Appendix II at page 88 Infra

22nd February 1954] [The Hon. Sri P. Thimma Reddi]

| | |
|---|---|
| Nellore జిల్లాబోర్డుకు | రు. 75,000 |
| Visakhapatnam జిల్లాబోర్డుకు | రు. 1,00,000 |
| Guntur జిల్లాబోర్డుకు | రు. 2,00.000 |

యీDearness Allowance grantsకు advanceగాయివ్వవలసివచ్చింది. ఆమాదిరిగా లోటును భర్తిచేయడానికి చిత్తూరు జిల్లా బోర్డుకు రు. 3 లక్షలు, అనంతపురం జిల్లాబోర్డుకు రు. 7·05 లక్షలు యివ్వవలసివచ్చింది. ఈ జిల్లాబోర్డుల Budget లను, మీా Special Officers తయారు చేస్తున్నారు. ప్రతి ఒక్క జిల్లాబోర్డుకు కూడ లోటు వుంటుందనే విషయం మీా అందరికీ తెలుసు. ఈ ఆర్థిక సంబంధమైన లోటును భర్తీ చేయడానికి గాను. సరిచేయడానికిగాను ప్రభుత్వమే బాధ్యతగా కనబడుతోందని అందరికీ తెలిసిన విషయమే. ఈజిల్లాబోర్డులబాధ్యతలలో ఒకటైన ఆదాయము వసూలు చేయుటకుకూడ, జిల్లాబోర్డులు బాధ్యత వహించడంలేదు. ఈ land cess, education cess మొదలైనవి ప్రభుత్వమే వసూలుచేసి, జిల్లాబోర్డులకు యిస్తోంది. గ్రామాలకు సంబంధించిన నీటివసతులు రోడ్లు, వాటినుండి ప్రభుత్వమే అధికారం తీసుకున్నది. అంతే కాకుండా వీటికి సంబంధించినవే కాక, అన్నియు చాల రోజుల క్రితమే ప్రభుత్వం తీసుకొన్నది. విద్య, ఆరోగ్యము మొదలైన వాటి విషయములోను యీా రోడ్లు విషయంలోను అంగీకారం కుదిరినది. మిగతా గ్రామాలకు సంబంధించిన కార్యక్రమము చాల మట్టుక్కు ప్రభుత్వముయొక్క సహాయముతోనే జిల్లాబోర్డులు నిర్వహిస్తున్నాయి. అందువల్ల, యీా జిల్లాబోర్డులు చేసేపని యెక్కువగా కనపడడములేదు. ఇప్పుడు దేశం అంతటా గ్రామగ్రామాలలో చేయవలసిన కార్యక్రమం ప్రభుత్వమే నిర్వహిస్తున్నది. అందువల్ల ఇప్పటికే మనరాష్ట్రంలో కొన్ని పంచాయితీలు యేర్పాటు చేయబడినవి. వాటిపరిపాలన అమలలోనికి వచ్చియున్నది. దేశమంతట కూడ పంచాయితీల పరిపాలన వస్తుంది. గ్రామ గ్రామాన్న మిగిలిన అన్ని గ్రామాలలో కూడ యీా పంచాయితీలను చేర్చవలసిన అగత్యం వున్నదని ప్రభుత్వము గుర్తిస్తున్నది. రాష్ట్రమంతట గ్రామాల్లో ప్రజలందరను కష్టాలనుండి తొలగించవలసి వున్నదని అందరూ ఒప్పుకొంటున్నారు. ఎప్పుడైతే, రాష్ట్రమంతటా ఈ పంచాయతీలు యేర్పాటు అవుతాయో, అప్పుడే జిల్లాభోర్డులు వుండవలసిన అగత్యము లేదనే అభిప్రాయము ప్రభుత్వము కల్గియున్నది. అందువల్ల యీా జిల్లాబోర్డులకు ప్రత్యేకంగా elections పెట్టవలసిన అగత్యము

[The Hon. Sri P. Thimma Reddi] [22nd February 19·4

లేదని ప్రభుత్వము అభిప్రాయపడుచున్నది. ఇట్టిపరిస్థితులలో జిల్లాబోర్డులను రద్దుచేయవలసినదని ప్రభుత్వము నిర్ణయించుకొన్నది. ఈ జిల్లాబోర్డుల పరిపాలనలోవున్న గ్రామాలలో ఈ జిల్లాబోర్డుల అధికారం క్రిందవున్న institutions కొన్ని వున్నవి. ఈ institutions నడపడానికి బాధ్యత కల్గిన సంస్థలను యేర్పాటుచేయడానికి ఆలోచనచేయవలసివున్నది. అందుకు సంబంధించి, యీ జిల్లాబోర్డులను రద్దు చేయటానికి సంబంధించిన విషయాలన్ని ప్రభుత్వముచూస్తున్నది. ఈ విషయాలన్ని ప్రత్యేకమైన పరిశీలన చేయవలసివున్నది. కాబట్టి, ఈ జిల్లాబోర్డులపై special officers యొక్క కాలపరిమితి 1-4-1955 వరకు పొడిగించవలసిన అవసరం యేర్పడింది కాబట్టి, యీ Bill రూపకంగా నేను కోరుతున్నాను.

Mr. Speaker :—The motion is that the Madras District Boards (Amendment) Andhra Amendment Bill 1954 be taken into consideration at once.

We will take up the general discussion on this bill, after lunch. I adjourn the house to 2-30 p. m.

The house adjourned for lunch.

(After Lunch 2-30 P. m.)

## POINT OF ORDER RE: REPORT OF THE PROHIBITION ENQUIRY COMMITTEE

Sri Vavilala Gopalakrishnayya :—అధ్యక్షా, ఇక్కడ మాకు యిచ్చిన నోటీసులతో పాటు Andhra Prohibition Enquiry Committee యొక్క నివేదికను యిక్కడ Table మీద పెట్టారు. కాని నాకుమాత్రం copy అందలేదు. రెండవది యిది summary గా కనుపిస్తోంది కాని, announce చేసిన ప్రకారము ఇది పూర్తి నివేదిక కాదు.

Mr. Speaker :-The typed copy is placed on the Table of the House. The report is being printed. The copies will be supplied, as soon as printing is over. Summary యిచ్చారనుకోండి. original copy యిక్కడ వుంది. ప్రింటింగు కాగానే కాపీలు సప్లయి చేయబడతాయి. ఈ report 70, 80 పేజీలు వుంది.

Sri Vavilala Gopalakrishnayya:-అటువంటి copies యేమైనా వుంటే members కు యిస్తే బాగుంటుంది.

Mr. Speaker:—It is not possible to roneo copies.

## HOURS OF SITTING OF THE HOUSE : THE MADRAS DISTRICT BOARDS (AMENDMENTS) ANDHRA AMENDMENT BILL, 1954

Sri Vavilala Gopalakrishnayya:—ఈ ఎసెంబ్లీ సమావేశం timings విషయంలో, ప్రొద్దుట, మధ్యాహ్నం sessions వుంటాయా?

Mr. Speaker:—When we adjourn for the day we will think over the matter.

Mr. Speaker:–The Madras District Boards (Amendment) Andhra Amendment Bill, 1954. మీాద ఇప్పుడు General discussion begin చేద్దామని అనుకున్నాను. ఇప్పుడు వచ్చిన amendments కూడ ఒకేసారి formal గా move చేస్తే amendments మీాద Bill మీాద general discussion జరుగుతుంది. కాబట్టి I request the Hon. Members to move the amendments standing in their name.

Sri Pillalalamari Venkateswarlu:-- ఈ amendments యిచ్చేందుకు యీా రోజు మూడు గంటల వరకు time యిచ్చారు. కాని amendments అన్నీ యిప్పుడు యిచ్చుటకు వ్యవధి లేదు. రెండవది వాటినన్నింటిసీ యిప్పుడే move చేయడం సాధ్యం కాదు. కాబట్టి రేపు move చేస్తే బాగుంటుంది. అందులకు మీారు అంగీకరిస్తే బాగుంటుందని మనవి చేస్తున్నాను.

*Sri M. Hanumantha Rao:– అధ్యక్షా, మన ముందు మంత్రి తిమ్మారెడ్డిగారు ఒక Bill ను ప్రవేశ పెడుతున్నారు. ఈ Bill చూడ డానికి చాల హాని లేదన్నట్లుగా కనుపిస్తోందే కాని, అసలు యీా Bill యొక్క ఉద్దేశ్యం speeial officers యొక్క పరిపాలనా పరిమితిని మరొక సంవత్సరము పొడిగించాలన్నదే యీా Bill లోని ప్రధానమైన విషయం. కాని, దీనిలో వున్నటువంటి Statement of Objects and Reasons లోని లక్ష్యాలను, ఆశయాలను దృష్టిలో పెట్టుకొని మనం చూచినట్లైతే యిది చాల హానికరమైనిదని, ప్రమాదకరమైనదని నేను భావిస్తున్నాను. ఇప్పటికే Spceial Officersయొక్క పరిపాలన చాల కాలంగా కొనసాగింది. ఇప్పుడు అమలులో వున్న చట్టం ప్రకారము, యిప్పటికప్పుడే క్రొత్తజిల్లాబోర్డుల ఎన్నికలుజరిగి మామూలుగా ఈనెలాఖరులోగానేవచ్చి వుండవలసింది. ఆవిధముగాచేయకుండా, ఆ Spceial Officers యొక్క పరిపాలన మరొక సంవత్సరము కొనసాగించాలని బిల్లు

యిప్పుడు విదితము చేస్తున్నది. దీనికి కారణాలు చూస్తే ప్రజాస్వామిక సూత్రాల ప్రకారము అంగీకరించడానికి వీలులేనివని అందరకు స్పష్టము అవుతుంది. దీనిలో యిచ్చిన కారణాలలో, ఒక కారణము యేమిటంటే, "It is not possible to arrange ior the reconstitution of the District Boards on the basis of the universal adult suffrage. ఇక్కడ ప్రమాదకరమైనటువంటి ఒక సూత్రాన్ని ప్రవేశ పెడుతున్నారు Adult franchise ప్రకారము అందరూ voting చేయడం సాధ్యంకాదని, జిల్లాబోర్డులను యేర్పాటు చేయటం అసంభవమని శ్రీ తిమ్మారెడ్డిగారు యీ సూచన యిస్తున్నారు. మొన్న యీ మధ్య మంత్రివర్గంవారు రాజ్యాంగానికి సంబంధించిన కొన్ని amendments సూచించినట్లు తెలియవచ్చినవి. బహుశా వయోజన ఓటింగు హక్కును ఎత్తివేయాలని కూడా ఒకసూచన పంపారేమో తెలియదు. Adult franchise మన దేశంలో తగదని. యెన్నికలు జరగ కూడదని అంటున్నారు.ఇదే సిద్ధాంతం ప్రకారము రేపు యీసూత్రాలనే Assembly కు, parliament కు కూడ వర్తింప జేస్తారేమో తెలియదు. Constitutional గా వయోజన వోటింగు ప్రకారము జరుపబడే యీ యెన్నికలుయెందుకుఅసంభవము అనినేను అడుగుతున్నాను. వయోజన వోటింగు విధానములో ఎన్నికలు జరుపుటలో యేమిటో కష్టము వుందన్నారు. సక్రమంగా వోటింగు జరిపించి యెన్నికలు జరిపించి, జిల్లా బోర్డులు యేర్పాటుచేయుటంలో కష్టాలు యేమిటో, దానిలో వుండే యిబ్బందులు నష్టాలు యేమిటో నాకు తెలియకుండా వుంది. కాని లోపాలుయేమైనా వుంటే సరిదిద్దుకోవాలిగాని నిరంకుశంగా, నిర్లక్ష్యంగా, రాజ్యాంగ విరుద్ధంగా ఎన్నికలు వాయిదావేయడం సబబు కాదు. రాజ్యాంగంలోని వయోజనవోటు హక్కులను రద్దుచేయాలని కూడా ప్రభుత్వము సూచించిందా? వయోజనులైన ప్రజలు తమకు ఇష్టము వచ్చినవారిని యెన్నుకొనే హక్కును కాదనడం చాల ప్రమాదకరం కాదా? ఈ విధంగా వారిహక్కు తిరస్కరించ బడుతోంది. ఇటువంటి తప్పుడు సూత్రాన్ని, ఒక హానికరమైన సూత్రాన్ని యిక్కడ statement of objects and reasons లో ప్రవేశపెట్టడం జరిగింది. ఇంకాసాకల్యంగా మరొకసంవత్సరం వ్యవధికావాలని ప్రభుత్వం అడుగుతోంది కనుక ఈ Billను ఆమోదిస్తే ఈప్రమాదకరమైనసూత్రాన్ని అంగీకరించి నట్లవుతుంది. కాబట్టి దీనిని అంగీకరించ వీలులేదని మనవి చేస్తున్నాను.

ఇక రెండవ విషయం ఏమిటంటే ప్రభుత్వంయొక్క దృష్టిలో అసలు జిల్లాబోర్డులు ఆర్థికంగా స్వయంసంపూర్తిగా ఉండలేక పోతున్నాయని, కనుక జిల్లాబోర్డులను రద్దుచేయాలని ఒక ప్రతిపాదనను తీసుకురావడం జరిగింది ఆతీర్మానం మనముందుకు తీసుకురాబడింది. ఆ ప్రతిపాదనను దృష్టిలో ఉంచుకొని దానిని ఏలాగైనా pass చేయాలని, ప్రభుత్వం ఆ ప్రతిపాదనను ఈరోజున సభముందు ఉంచడం చాలా అక్రమంగా, నిరంకుశంగా ఉన్నది. ఇది తీవ్రముగా నిరశింపదగిన విషయము అని నేను మనవిచేస్తున్నాను. ముఖ్యంగా ఆర్థికంగా స్వయం సంపూర్తిగా లేవనేటటువంటి దానిని సాకుగా తీసుకొని జిల్లాబోర్డులను రద్దుచేయాలని ప్రభుత్వం సూచిస్తోంది. ఇది సరైన విధానంకాదు. ఈ జిల్లాబోర్డుల ఎన్నికలను 2 సంవత్సరములనుంచి వాయిదావేయడం జరుగుతున్నది వాయిదావేసినప్పటినుంచి పాతజిల్లాబోర్డువారే ఇంకా ఉన్నారు. ఈ రెండు సంవత్సరములనుంచి జిల్లాబోర్డులను మనరాజ్యాంగ చట్టంలో ఈ జిల్లాబోర్డులకు సంబంధించిన సూత్రాలను, విధానాలను మార్చుటకు వ్యవధి అని మాత్రమే వాయిదావేయడం జరిగినది. కాని యిపుడు జిల్లాబోర్డులను వాటికి ఆర్థికంగా స్వయంసంపూర్తి లేదు కనుక రద్దు చేయాలంటున్నారు. ఈ విషయం వీరికి యిప్పుడేనా తెలిసినది? జిల్లాబోర్డులు ఆర్థికంగా స్వయంసంపూర్తిగా చాలాకాలంనుంచి లేవే! అయినట్లైతే ఈ 2 సంవత్సరాల కాలంలో వీరికి ఈ విషయం జ్ఞాపకం రాలేదా? అటువంటపుడు ఆకాలంలో వారికి ఈ విషయం తప్పకుండా జ్ఞాపకం వచ్చియుండవలసిందేనే! వీరికి ఈ విషయం ఇప్పుడు జ్ఞాపకం ఎందుకు వచ్చినది?

ఆర్థిక స్తోమతే కారణమైతే ఇపుడున్న పరిస్థితిలో మనఆంధ్ర శాసనసభ ఎంతకాలం ఉంటుందో చెప్పడానికి వీలులేదు. ప్రస్తుతం మన ప్రభుత్వానికి డబ్బులేదు. ఎసెంబ్లీ (Assembly) వల్ల చాలా డబ్బు ఖర్చవుతోంది అందుచేత ఆఖర్చు తగ్గించుటకుగాను ఈ Assembly ని రద్దుచేయుటకు Local Administration కు సంబంధించిన మంత్రి తిమ్మారెడ్డిగారో, ముఖ్యమంత్రిగారో ఒక ప్రతిపాదనను తీసుకొనే వస్తారో యేమో? ఇపుడున్న డబ్బు చాలడంలేదు ఆర్థికంగా స్వయం సంపూర్తిలేదు. అందుకని ఈ Assemblyని రద్దుచేసి President rule పెట్టడానికి అవసరం ఉందని ఆవాదన పకారం అనవచ్చు ఏదో ఈవిధమైన argumentతో ఈ Bill ను ప్రవేశపెట్టి దీనినేలాగైన నెగ్గించు

కుందామని ప్రభుత్వోద్దేశం. ఈబిల్లును ఈవిధంగా జిల్లాబోర్డు ఎన్నికలు వాయిదా వేయడానికి కారణం ఏమిటంటే Adult Franchise లో ఎన్నికలు వచ్చినట్లయితే ప్రభుత్వం, కాంగ్రెస్‌పార్టీవారు ఆ ఎన్నికలలో నెగ్గలేరేమో అనేభయమై యుండవచ్చు. ఎన్నికలంటే వీరికింత భయము ఎందుకు ? ఎన్నికలు పెడతామని యిన్నాళ్ళుగా చెబుతూ వచ్చి యిప్పుడు అసలే జిల్లాబోర్డుల్ని రద్దు చేస్తా మంటూన్నారు. అసలు పాతజిల్లాబోర్డుల కాలపరిమితి 1952 December నెలలో అయిపోయినది. అపుడు పాతజిల్లాబోర్డుల కాలపరిమితి 1 సంవత్సరానికి పొడిగిస్తూ ఎన్నికలను వాయిదా వేయడానికి ఒకప్రతిపాదనను శాసనసభ ముందుకు తీసుకువచ్చారు. ఆరోజున మనమందరమూ ఎన్నికలను ఈ విధంగా వాయిదావేయడం సరైనపద్ధతికాదని తీవ్ర అసమ్మతిని వెలిబుచ్చాము. ఈరోజునమంత్రివర్గంలో ఉన్నవిశ్వనాధంగారు ఆరోజున ప్రతిపక్షనాయలుగా ఈ ఎన్నికలను 1 సంవత్సరంవరకూ వాయిదావేసే విధానం సరైనది కాదని చాలా వ్యతిరేకంగాచెప్పడం జరిగింది. దానికి అసెంబ్లీలో చాలామంది వ్యతిరిక్తులై ఉండడంవల్ల పాతజిల్లాబోర్డులకాలపరిమితిని 1 సంవత్సరంనుంచి 6 మాసములవరకు తగ్గిస్తూ, కొత్త ఎన్నికలు జరుపుతామని హామీయిచ్చారు. 53 జూన్ మాసంలోనే ఎన్నికలు జరుపుతామని రాజగోపాలాచార్యులుగారు హామీని యివ్వడం జరిగింది. అపుడు దానిని అంగీకరించడం జరిగింది. విశ్వనాధంగారు కూడా త్వరలో ఎన్నికలు జరపాలన్నారు. అపుడు కృషిక్‌లోక్‌పార్టీ ఉపనాయకుడుగా ఉన్న తిమ్మారెడ్డిగారు ఎన్నికలు జరపటానికి నెలరోజుల వ్యవధే చాలన్నారు. కాని ఎన్నికలను జూన్‌నెలలో జరపటం జరగలేదు. దానికి కారణమేమిటో ఎవరికీ తెలియదు. ఇప్పటికీ పాతజిల్లాబోర్డులే ఉన్నాయి. తరువాత మరొక సంవత్సరానికి ఎన్నికలను మరలవాయిదా వేయాలని మరొక ప్రతిపాదనను తీసుకు వచ్చారు. అపుడుదానికికూడా అసెంబ్లీ తీవ్ర అసమ్మతిని తెలియచేసినది. ఆప్రతిపాదనను అసెంబ్లీలో తీసుకు వచ్చినపుడు అది ఓడిపోవడంజరిగింది. అయితే వెంటనే ఎన్నికలుజరపటం సాధ్యంకాదనేమిషతో బోర్డులను రద్దుచేసి వారిస్థానే స్పెషల్ ఆఫీసర్లను వేసి 1954 మార్చిలోగా ఏపరిస్థితిలో నైనా ఎన్నికలు జరుపుదామని రాజగోపాలాచారిగారు ఒకప్రతిపాదన పెట్టి నెగ్గించారు.

కనీసము యీ వాగ్దానాన్నయినా అమలు జరపక పోగా యీరోజు మళ్లీ నిరంకుశోద్యోగుల పాలననే మరొక సంవత్సరం పొడగించాలని

22nd February 1954] [Sri M. Hanumantha Rao]

బిల్లు తేవటం గర్హ్యనీయం. ఆంధ్ర ప్రభుత్వము అధికారానికి వచ్చి 5 మాసములైనది. జనవరి సమావేసము నాటికే జిల్లాబోర్డులకు ఎన్నికలు ఎలా జరపటమా అని ఆలోచించి యుండవలసింది. వాయిదా వేసే సూచన వుంటే ఆ సమావేశంలోనే చర్చకు పెట్టవలసింది. ఆ సూచనను అసెంబ్లీ తిరస్కరిస్తే ఎన్నికలు జరపటానికి సరిపోయిన కాలవ్యవధి వుండేది. అదేమో చేయక, యీ చివరి క్షణంలో, గడువు కాలంలో ఎన్నికలు పెడదామనుకున్ననూ వీలులేని కాలవ్యవధితో యిక్కడ ప్రభుత్వం బిల్లును ప్రవేశపెట్టడం పచ్చి నిరంకుశత్వం. వాగ్దానాలకూ రాజ్యాంగ చట్టానికి విరుద్ధం. శాసన సభ నిర్ణయాలను నిర్లక్ష్యంచేసి నిరంకుశత్వంగా ప్రవర్తించటం.

ఎన్నికలంటేనూ ప్రజలంటేనూ అసహ్యం పుట్టే యీ కాంగ్రెసు ప్రభుత్వాలు యిటువంటి నిరంకుశ చర్యలకు పూనుకుంటున్నాయని స్పష్టం. మద్రాసు ప్రభుత్వము అసలు యీ ఎన్నికల పద్ధతినే ఎత్తి వేయాలని జిల్లాబోర్డులను రద్దు చేయాలనీ ఆలోచిస్తున్నది. ఆలాగే మన ప్రభుత్వమూ ఆలోచిస్తున్నది.

జిల్లాబోర్డులను రద్దు చేయుటమంటే బ్రిటిషుప్రభుత్వం కాలంనుంచీ వున్న స్థానిక స్వపరిపాలనకుగూడా స్వస్తిచెప్పటమే తప్ప మరేమీ గాదు. జిల్లాబోర్డులను రద్దుచేసి వాటిస్థానే తాలూకా బోర్డులను పెడతామన్నా, పంచాయితీ బోర్డులకు ఎక్కువ అధికారాలిస్తామన్నా పర్యవసానం స్థానిక స్వపరిపాలనకే స్వస్థిచెప్పటానికి మినహా మరేమీగాదు.

తాలూకా బోర్డులు జిల్లాబోర్డులస్థానం తీసుకోలేవు. జల్లా మొత్తం మీాద వచ్చే ఆదాయాన్నయినా వెనుకబడిన ప్రదేశాలను అభివృద్ధికి తేవటానికి, ఒక తాలూకాకు మించిన పెద్దపనుల్నిగూడా అవసరాన్ని బట్టి చేయుటానికీ జిల్లాబోర్డులకు అవకాశం వుంటుంది. తాలూకాబోర్డుల అధికారాలు మరింత పరిమితంగానే వుండక తప్పవు. అలాగే పంచాయితీ బోర్డులకు ఎంత అధికారాన్ని ఇచ్చినా వాటి హద్దులు గ్రామం వరకేగదా. కనుక అధికారం వికేంద్రీకరణం చేస్తామనే పేరు చెప్పి నిజానికి అధికారాన్నంతటినీ తమ గుప్పెట్లోకి తెచ్చుకోవటానికే ప్రభుత్వం యీ పన్నాగం పన్నుతోంది.

అవినీతి పెరిగిందని మరొక కారణం చెబుతున్నారు. ఇన్నాళ్లుగా యీ జిల్లాబోర్డుల్ని పరిపాలించి వాటిని అవినీతి పాలుచేసినవారు

[Sri M. Hanumantha Rao] [22nd February 1954

కాంగ్రెసువారే. అందుకు ప్రజలు శిక్ష ఎందుకు అనుభవించాలి. అనుభవంలో చూశారు గనుక అవినీతిపరులు కానివారిని ఎన్నుకోవటానికి ప్రయత్నిస్తారు. ఆవిధంగానే ప్రజాస్వామికం ముందుకు వస్తుంది. అంతే గాని అసలు ఎన్నికలే రద్దుచేయటం వల్లగాదు.

పరోక్షంగా పంచాయితీ బోర్డులద్వారా జిల్లాబోర్డు సభ్యుల్ని ఎన్నుకోనాలనే సూచనగూడా వున్నట్లు తెలుస్తోంది. సూటిగా ప్రజలు ఎన్నుకునే హక్కును ఎలా హరించి, తమ అనుయాయుల్ని తెచ్చుకుందామని చేసే ప్రయత్నాల్లో ఒకటే యిది.

జిల్లాబోర్డులను రద్దుచేయటానికీ వీలులేదు. స్పెషల్ ఆఫీసర్ల జీవితం పొడిగించటానికీ వీలులేదు. వెంటనే జిల్లాబోర్డు యెన్నికలు జరిపే సదుపాయం చేయాలి. ప్రజాస్వామిక వ్యతిరేకమైన యీ బిల్లును పూర్తిగా ప్రతిఘటించాలి.

2-50 P.M. * Sri V. Srikrishna :—అధ్యక్షా! ఈబిల్లును ప్రతిపాదించినటువంటి మంత్రి తిమ్మారెడ్డిగారు లోగడ మద్రాసు శాసనసభా సమావేశాల్లో నిరంకుశత్వ విధానంమీద చేసిన దీర్ఘమైన ప్రసంగాలు ఉన్నయి. అవన్నీ, శాసనసభా రికార్డులు చదువుకుంటే తెలుస్తుంది. కొన్ని దేశాల్లో నిరంకుశం ఉందని వివరిస్తూ మన దేశంయొక్క ప్రజాస్వామ్యం గురించి చెప్పిన వారిలో నొకరు ఈనాడు బిల్లును ప్రవేశపెట్టుతూ జిల్లాబోర్డుల ఎన్నికలు నిర్వహించకపోగా అసలు జిల్లాబోర్డులనే ఎత్తి వేయడానికి చూస్తున్నారు. అనేక విషయాలలో కాంగ్రెసు మనం అనేక సంవత్సరాలనుండి పోరాడి త్యాగాలతో సాధించిన హక్కులను, సాంప్రదాయాలను 1947 సంవత్సరంలో అధికారంలోకి వచ్చిన తరవాత వాటిని విడనాడి క్రమంగా ఎలా తిరోగమిస్తోందో ఈ విషయంలోనూ అలాగే చేస్తుంది. స్థానికస్వపరిపాలన కావాలనీ, స్థానిక సంస్థల హక్కులు విస్తృతం కావాలనీ మన జాతీయోద్యమంలో పాల్గొన్న అన్నిపార్టీలవారూ పోరాడారు. కొన్నిహక్కులు సాధించారు. అలాంటి స్థానిక స్వపరిపాలన సూత్రాన్నే రద్దుచేసి వాటి హక్కుల్ని నానాటికి సంకుచిత పర్చడమేగాక నేడు వాటిని రద్దుపర్చటమే చేస్తున్నారు. ఎన్నికలన్నా వయోజనఓటింగన్నా అధికారంలోవున్న వర్గాలకు బెదురుజాస్తి అయింది. వాటికి తిలోదకాలిస్తున్నారు. జనరల్ ఎన్నికల్లో అవినీతికి, దుష్పరిపాలనకూ బాధ్యులైన మంత్రుల్ని, శాసన

22nd February 1954] [Sri V. Srikrishna]

సభ్యుల్ని ప్రజలు ఓడించారు. పంచాయితీఎన్నికల్లో లోగడ అధ్యక్షులుగావున్నవారు 100కి 5 లేక పదిమందికి మించి ఎన్నికల్లో ఈసారి నెగ్గలేదు. వీటన్నిటిని చూచి భయపడ్డ ప్రభుత్వం అనేక వక్రమార్గాలను అవలంభిస్తోంది. ఉదాహరణకు తిరువాన్కూరు కొచ్చిన్ తీసుకోండి. అక్కడ రాజ్యాంగచట్టం ప్రకారం ఎన్నుకోబడ్డ శాసనసభ్యులు ఆశాసన సభలో అధికసంఖ్యాకులు మంత్రివర్గంపై విశ్వాసరాహిత్య తీర్మానం పెట్టి వారి దుష్పరిపాలనకు నిరసన తెలిపారు. ఏమి జరిగింది? పనికిరారని విశ్వాసం లేదని చెప్పబడ్డ మంత్రులు మాత్రం మంత్రివర్గంలో ఉన్నారు. విశ్వాసరాహిత్య తీర్మానం పెట్టిన శాసనసభ మాత్రం రద్దయింది. ఇదే కాంగ్రెసు ప్రజాసామ్యానికి నగ్న చిహ్నం. అదే విధంగా పంచాయితీ బోర్డుల్లో ప్రతిపక్షాలు నెగ్గా యనే కారణంతో వాటి నిర్వహణలో ఆటంకాలు కలిగిస్తున్నారు. కొన్ని పంచాయితీలను విభజించేందుకు మంత్రివర్గం నుండి కూడా సూటిగా ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఈనాడు జిల్లాబోర్డులను రద్దుపరిచే సూత్రం తెచ్చి ప్రవేశపెట్టారు. జిల్లాబోర్డుల్లో ఆర్థికచిక్కులు ఉన్నాయని, దుష్పరిపాలన జరిగిందనీ కారణం చెబుతున్నారు. ఆ బోర్డులను ఇంతకాలం పరిపాలించిందెవరు? ఈనాడు మంత్రివర్గంలో వున్న పార్టీల ముఖ్యుల అనుచరులే ఇంతకాలంగా ఆ పరిపాలనలో ఉన్నారు. కాంగ్రెసు పార్టీవారే గాదు, తిమ్మారెడ్డిగారి అనుచరులు కూడా వున్నారు. వారేకదా ఈ దుష్పరిపాలనకు బాధ్యులు? వారిపరిపాలనపై విచారణ జరిపించమనండి. చర్య తీసుకోమనండి మే మూసహకరిస్తాం. కాలికి పుండు పుట్టిందంటే కతికెనే కత్తిరించటానికి పూనుకొని పుండుమాన్పడం మంచిది. జిల్లా బోర్డులకు ఎన్నికలు జరిపేట్లయితే రాష్ట్రమంత్రులకు పంచాయితీబోర్డు అధ్యక్షులకు ఇచ్చిన తీర్పునే జిల్లాబోర్డుల పరిపాలనకు కూడా ప్రజలే ఇస్తారు. ఆ బాధ్యత ప్రజలకే వదలండి. ఎన్నికలు జరపండి. ఈనాడు పంచాయితీల హక్కులు చాలా పరిమితం చేయబడ్డాయి. ప్రజోపయోగకరమైన పనులు చేయడానికి ఆటంకాలున్నాయి 100 కి 12½ వంతులు యివ్వవలసిన రెవెన్యూ సెస్సుఫండు యివ్వకపోడంవల్ల తుదకు రాష్ట్ర పంచాయితీ అధ్యక్షుల సమావేశంలో ప్రభుత్వంమీద కోర్టుకువెళ్లాలనే తీర్మానం చేయవలసి వచ్చింది.

**The Hon. Sri P. Thimma Reddi:**—ఇలాంటిచర్చ పంచాయితీ కాన్ఫరెన్సులో ఏమీరాలేదు. అవసరంకూడాలేదు. సభ్యునికిఈవిషయం తెలియదేమో. తెలుసుకుని మాట్లాడడం అవసరం.

[22nd February 1954

Sri V. Srikrishna:—తీర్మానాలుకూడా చేశారుకదా!

The Hon. Sri P. Thimmareddi:—దేశంలో తీర్మానాలు అనేకం జరుగుతూవుంటాయి. ఎక్కడో ఒకచోట కూర్చుని తీర్మానాలు అనేకం చేసుకుంటారు.

Mr. Speaker:--Let the hon. Member proceed with his speech.

Sri V. Srikrishna:—ఈ రోజున పంచాయతీబోర్డులలోవున్న ద్రవ్యాన్ని వినియోగించడానికి తగిన అవకాశాలు లేకుండా ఖర్చు 250 రూపాయలకు పైబడితే జిల్లాపంచాయితీ ఆఫీసర్లనుంచి, 800రూపాయలకు పైబడితే I. L. B. దగ్గరనుంచి పర్మిషన్ తెచ్చుకోవాలని అనేక ఆటంకాలు కల్పిస్తూ వారి హక్కులను భంగపర్చడం జరుగుతోంది.

జిల్లాబోర్డులు ప్రజలకు అనేక ముఖ్యమైనపనులు చేయవలసివుంది. మా జిల్లాబోర్డువారు 8 లక్షల యెస్టిమేటుతో రోడ్డువేసి చివరకు ఒక కాలవకు వంతెన కట్టనందువల్ల బళ్ళు నడిచేందుకు వీలులేక 3 సం॥ల నుంచి చేసినపనంతా వృధాఅయిపోతోంది. పల్నాడు తాలూకాలో ఒక హాస్పిటల్ కట్టారు. కాని దానికితగిన staff ని వెయ్యక హాస్పిటల్ నిండా పెంకులు మాత్రం వున్నాయి. ఒకచోటస్కూలు బిల్డింగుకట్టారు. కాని విద్యార్థులులేరు. చందోలు తాలూకాలో ఒకవంతెన కడితే వానికి Approach road లేక వంతెన ఎందుకూ ఉపయోగం లేకుండాపోతోంది. ప్రభుత్వం ఈవిషయాలను సరిగా గమనిస్తోందా. హైవేస్ డిపార్టుమెంటును అడిగితే మాకువచ్చే గ్రాంట్లు రోడ్లురిపేరు చేయడానికేగాని క్రొత్త పనులు చెయ్యడానికి కాదనిచెపుతున్నారు. కాబట్టి జిల్లాబోర్డులను సంస్కరించడానికి పూనుకోవాలిగాని వాటిని రద్దుచెయ్యకూడదని నేను కోరుతున్నాను.

యెన్నికలు జరుపకుండా స్పెషల్ ఆఫీసర్ల పరిపాలన మరొక సంవత్సరముపాటు పొడిగించాలంటు వీటిని రద్దుచేసే విషయం కూడా ఆలోచనలో వుందని గౌ॥ మంత్రిగారు చెప్పారు. ఆంధ్రరాష్ట్రం రాకపూర్వమే యెన్నికలు జరిగి వుండవలసింది. అప్పుడడిగితే రాష్ట్రం వచ్చిన తర్వాత చూచుకుందామన్నారు. రాష్ట్రం వచ్చిందేకాని ఇంతవరకు యెన్నికలవిషయం ప్రభుత్వం ఏమీపట్టించుకోవడంలేదు. పాపం ప్రభుత్వం యెన్నో క్లిష్టసమస్యల నెదుర్కొనవలసి వచ్చింది. మంత్రివర్గాన్ని

22nd February 1954] [Sri V. Srikrishna]

సరియైన పద్ధతిలో పెట్టుకోడానికే 5 నెలలు పట్టింది. 7 రు మంత్రుల్ని 8 కి పెంచారు. 8 ని తిరిగి 7 కి తగ్గించారు. ఈసమస్యలన్నీ పరిష్కరించు కోడానికి ఒకసంవత్సరమైనా చాలక పోవచ్చు. వెంటనే యెన్నికలు జరిపినట్లైతే మేము వస్తామనికాదు. మేము వచ్చినా రాకపోయినా యెన్నికలు జరపాలని సవాలు చేస్తున్నాము. ఇదివరకు జిల్లాబోర్డులలో అపసవ్యంగా పనిచేసేవాళ్ళను దింపివేసి క్రొత్తవారు రావడానికి సావకాశం యివ్వాలి. వెనుక ఒక మంత్రిగారు హనుమంతరావుగారు రాజీనామా యిచ్చి యెన్నికలో పోటీకినిలవాలని సవాలు చేశారు. ఇప్పుడు జిల్లా బోర్డుల్లో యెన్నికలు పెట్టి నిలవాలని మేము సవాలు చేస్తున్నాము. ప్రజాస్వామ్యాన్ని పునరుద్ధరిస్తానని కంకణం కట్టుకుని ఆంధ్ర కేసరి అని పేరుపొందిన ప్రధానమంత్రి అధ్వర్యాన జిల్లాబోర్డులు రద్దుకాకూడదని కోరుతున్నాను.

Mr. Speaker :—Hereafter each member will have ten minutes only.

* Sri K. Krishna Rao :—అధ్యక్షా, ఈబిల్లుతో యిచ్చిన statement of objects and reasonsలో మొదటిది చూస్తే 'It is not possible to arrange for the reconstitution of the District Boards on the basis of universal adult franchise' గా కనపడుతోంది. మనదేశంలో జిల్లాబోర్డులు రావడం క్రొత్తకాదు. జిల్లాబోర్డులు ప్రజాతంత్రసంస్థలుగా వుండాలని కొన్ని దశాబ్దాలనుంచి పోరాటం జరుగుతోంది. జిల్లాబోర్డులు మ్యునిసిపాలిటీలు autonomous units గా వుండాలని నిర్ణయించుకొని దానిని ప్రజలు చాలావరకు సాధించుకున్నారు. జాతీయవాదులు, జాతీయోద్యమాలు కోరిందికూడా అదే. వీరు ముఖ్యంగా చూచే విషయాలు, విద్య, ఆరోగ్యము, రహదారి మొదలైనవి వుంటాయి. ఇవన్ని ప్రజల జీవితసమస్యలు కాబట్టి వారి సహకారం కూడా దీల్లో చాలాఅవసరం. Director of Public Health ఎన్ని ఆర్డర్లు వేసినా ప్రజల సహకారం లేనిదే ఏపనీ జరుగదు. ప్రజల enthusiasm ను దీనితో coordinate చేస్తేనే గాని ప్రభుత్వం కేవలం ఏపనీ చెయ్యలేదన్న విషయం చరిత్రలో రుజువైంది. దీనిని మేము సృష్టించలేదు. ఇతరదేశాలలోకూడా మన జిల్లాబోర్డులకు వలెనే country councils వగైరాలున్నాయి. Civic amenities వాళ్ళకి వప్పజెప్పవలెనన్నది మానవస్వభావంలో ఒక అనివార్యమైన మార్పు.

[Sri K. Krishna Rao] [22nd February 1954

ఆ మార్పు ఏవిధంగా వచ్చినా దానిని అగౌరవపర్చడం మన సాంప్రదాయాలను మనచేతులతోనే నాశనం చేయడం అవుతుంది.

Constitution లోని 6th schedule లో clause (a) Art. 2 లో tribal areas ను గురించి చెప్పిందేమంటే "There shall be a district council for each autonomous district consisting of not more than 24 members, of whom not less than ¾ths should be elected on the basis of adult suffrage. ఈవిషయం నేనెందుకు చెపుతున్నానంటే Tribal areas లో వుండేవాళ్లకు విజ్ఞానముగాని, విద్యగాని ఇతరప్రాంతాలవారితో సమానంగావుండవు అటువంటి ప్రాంతాలలోకూడా adult franchise అమలుపరుస్తున్నారంటే దేశాభ్యుదయము, ప్రజల తోడ్పాటు, సమీకరణ లేకపోతే ఏపని జరగదు. వెనక బాలగంగాధర తిలక్‌గారి కాలంలో plague, influenza ను గురించి tackle చేయలేకపోతే గొప్ప పోరాటము జరిగింది. దానికి గొప్ప చరిత్ర. సంప్రదాయం వుంది. Adult franchise ను tribal areas లో కూడా పెట్టాలంటూవుండగా మన మంత్రివర్గం దానిని కాలదన్నడానికి ప్రయత్నిస్తున్నారంటే constitution కు విరుద్ధంగా వెళుతున్నారని మనకి తెలుస్తోంది ఈవేళ శ్రీ తిమ్మారెడ్డిగారు మాట్లాడుతూ పంచాయితీలకు ఎక్కువ అధికారాలు యిస్తామన్నట్లు చెప్పారు. నేను చెప్పేది, ఆరోజునుంచి ఈరోజువరకు ఆంధ్రదేశంలో 500 జనాభాకు పైగావుండే గ్రామాలు ఎన్ని ? అక్కడ ఎన్నిచోట్లలో పంచాయితీలు పెట్టారు ? నెల్లూరు తాలూకా తీసుకుచూస్తే, ఎక్కడైతే గ్రామపెత్తన దారులు వున్నారో అక్కడ పంచాయితీలు ఏర్పరచడం ఎక్కడ బీదవాళ్లు ఎక్కువగా వున్నారో అక్కడ పంచాయితీలు లేకపోవడం, పెత్తనదారులు వారి అనుచరులు బలంగా వున్నచోట పంచాయితీలు ఏర్పడుతున్నాయి. ఎన్నో గ్రామాలలో ఉత్సాహవంతమైన ప్రజలు వున్నచోట్ల పంచాయితీలు organise చేయబడలేదు చంద్రమౌళిగారు చెప్పిన గ్రామస్వరాజ్యం మనకు హుళక్కి అయిపోయింది. అవి అన్నీ empty promises, platform speeches మాత్రమే అయినవి. ఈవేళ దీనిలోవుండే రహస్యం ఏమిటంటే స్థానికసంస్థలంటె ప్రభుత్వానికి ఇష్టం లేదు. Co-operative Societies విషయం తీసుకొండి 1921 నుంచి ఈ రోజువరకు తీసుకుంటే కో-ఆపరేటివ్ సొసైటీ రిజిస్ట్రారుగారి ప్రత్యేకమైన మిరాసీలు అయిపోయినాయి. పంచాయితీ గ్రామాల్లో

22nd February 1954] [Sri K. Krishna Rao]

ఏ చిన్నపని చేయాలి అన్నా సరిపోకుండావుంది. వారికి అధికారులను చూడ్డానికే సరిపోతోంది. ఇది decentralisation విధానం కాదు. Bureaucratic decentralisation, ప్రజాసంస్థల యందు అధికారుల dominance ఏర్పరచడం ప్రభుత్వ విధానంగా తయారైనది. co-operative societies చూసినా, village panchayats చూసినా, ప్రతిచోట కనిపించేది ఏమిటంటే peoples organisations లో decentralisation వ్యతిరేకించడం జరుగుతోంది. ఇందువల్ల దేశం ముందుకు వెళ్ళనే వెళ్లదు. ప్రజలుచాలా బలహీనులై పోతారు. Sir Thomas Munroe గారు సూచించిన రైత్వారీ land reforms ఏమిటి ? ప్రతిరైతుతోను settlement చేయడంవల్ల గ్రామమొత్తంగా వుండే settlement గ్రామం యొక్క సమిష్టిబాధ్యతగా కాకపోయి ప్రతిరైతుతోను నేరుగా సంబంధం చేయడంవల్ల, ప్రతిగ్రామసమిష్టి దృక్పథాన్ని atomise చేయడంజరుగుతోంది. సంజీవరెడ్డిగారు చెప్పిందిచూస్తే వారి మంత్రివర్గాన్ని బలపరిచేవారు వుంటేనే పనులు జరుగుతాయి. opposition వాళ్లు చెప్పేది అంతా వ్యతిరేకమైపోతుంది. ఈవిధానం వల్ల yes men తయారవుతున్నారు. ఈవేళ ఆంధ్రదేశం పెద్దపెద్ద పరిశ్రమలు లేని రాష్ట్రం. గ్రామీణ పరిశ్రమల్లో centralisation లేకుండా democratic పద్ధతి మీద అమలు జరుపవలసివున్నది. Public Health విషయం లో ప్రజలుపడే ఇబ్బందులు వర్ణనాతీతంగా వున్నాయి. ఈ మధ్యనెల్లూరు జిల్లాలో కలరా వల్ల ప్రజలు చాల బాధపడ్డారు. బాధ్యత యెవరిదిఅంటే మునిసిపాలిటీ వారుకాని, District Health officer కాని బాధ్యత వహించరు. నేను చెప్పేది ఏమిటంటే, ఇటువంటి విషయాల్లో democratic organisations centralised గా organise చేస్తే ప్రజలయొక్క ఇబ్బందులు తీరగలవు. కలరాను బాగా tackle చేయవచ్చును. ఆవిధంగా చేయవలసి వుంటుంది. డబ్బులేదనే సమస్య తిమ్మారెడ్డిగారు చెప్పారు. దానికి బాధ్యులు యెవరా ? సెస్సులమీద జిల్లాబోర్డులు ఆధారపడియుంటాయి. యెస్టేట్లనుంచి వచ్చే సెస్సులు అన్నీ వసూలు అవుతున్నాయా ? కొన్నిలక్షల రూపాయలవరకు పోయినాయి. ప్రజాప్రతినిధి అంటే ప్రజాప్రతినిధే. నేనుచెప్పేది Bureaucratic officer కంటె యెప్పుడైనాగొప్పవాడే. Deficit వచ్చిందంటే land revenue వారికి రావలిసింది రాకుండాపోయింది. మేజస్ట్రేట్లకోర్టు, prosecutions వల్ల వచ్చే fines ఆంధ్రజిల్లాలకు సంబంధించినంతవరకు

[Sri K. Krishna Rao] [22nd February 1954

Accountant-general ఆఫీసులో ఇంకా adjust కాలేదు. Deficit కారణంగా జిల్లాబోర్డులను ఎత్తిపారేస్తే, ఈప్రభుత్వాన్ని కూడా ఎత్తి పారేయాలి. Deficit Budget అనేది ఒకేసంస్థయొక్క inefficiency కి కారణమైతే ప్రభుత్వం స్థితి ఆవిధంగానే వున్నది. ఆ విధంగా చూసిన నాడు కాబినెట్లు ఎన్నిసార్లు abolish చేయాలి అని అడుగు తున్నాను. వాళ్ళ finances వృద్ధిచేయడానికి ఎన్నో ఇబ్బందులు వున్నాయి. ఆ యిబ్బందులనన్నీ తీసుకోకుండావుంటే మీరు ఒకటి తెలుసుకోవాలి. State కు కొన్ని functions వున్నాయి. కాలువ కావ లిస్తే 10 మంది కలిసి త్రవ్వాలి అనే త్రివేదీగారి భావం మంచిదిగా వుండవచ్చును. ప్రభుత్వబాధ్యతకాదని ఆయనచెప్పవచ్చును. కాని ప్రభు త్వమే ఆపని చేయాలి. చేస్తేనే జరుగుతుంది లేకపోతేకాదు. ప్రజలలో స్వయం సహాయం, ఐక్యత వృద్ధిపరచాలంటే జిల్లాబోర్డులు మించిన organisations మరొకటిలేవు. అస్సాంలో adult franchise తీసుకురావ డానికిఅవకాశంవుంటే అంతకన్న కనిష్టమైన దేశమాఇది? న్యాపతిసుబ్బా రావు, ఎ. పి. పాత్రో మొదలైన local administration లో authorities వుండినటువంటి ఈ ప్రాంతంలో ఇదేనా జరుగవలసింది? దీనికి మీరు చెప్పిన కారణాలుకానేకావు. అట్లానేఅయితే అది unconstitutional. దీనివల్ల మీ administration పాడవడం జరుగు తుంది. ఇటీవల special officers కొందరువచ్చారు. వారు వచ్చిన తరు వాత New scheme of Elementary Education విధిగా అమలు పరి చారు. జిల్లాబోర్డులువుంటే అల్లా జరిగివుండేదికాదు.

[*At this Stage*
Sri T. Lakshminarayana Reddi occupied the chair]

ఇటువంటి scheme ల విషయంలో special officer లు వెంటనే అమలుపరచారు. అదేసందర్భంలో ప్రజలు ఎన్నుకొన్న ప్రతినిధులుంటే విచారించకుండా అమలు జరిపేవారుకారు. అదేవిధంగా teachers విషయమైpolicyచూడండి. Rent free schoolలేనిదే grantయివ్వడానికి యిబ్బందులు పెడుతున్నారు. అదేవిధంగా special officer ల హయాం లో education, public health యింకా యితర విషయాల్లో వెనుకబడి వున్నారు. District Board Presidents వుంటే ఆవిధంగా చెప్పరు. Special officers కాలంలో Local works of tremendous importance ప్రజల ఆశయాలు వెనుకబడుతవి అన్నమాట.

జిల్లాబోర్డు administration లో Special officers ను continue చేశారంటే state చేయవలసిన కొన్నికొన్ని ముఖ్యమైన కార్యాలు జరుగవు. కనుక యిబ్బందులు అనుభవింపవలసి వస్తున్నది. మంచినీళ్ల బావులు లేకుండావున్నాయి. సక్రమమైనటువంటి సౌకర్యాలవిషయంలో District Boards చర్యలు తీసుకోవాలి. ప్రజలకు District Boards కు వున్న సన్నిహిత సంబంధాన్నిబట్టి responsibilities ఖచ్చితంగా feel అవుతారని మనవి చేస్తున్నాను. ప్రజల interests ను focus చేయ డానికి Special officers ప్రయోజనకరంగా వుండరు. ప్రజలకు కావల సిన beneficient public works, వుపయోగకరమైన పనులు Special officers rule లో జరుగవు. ఈ Bill ను support చేశారంటే District Boards abolition కు ఒప్పుకున్నవారు అవుతున్నారని మనవిచేస్తున్నాను. ఈ విషయం తెలిసికొని జిల్లా బాగుపడ్డానికి district board role ఎంతో గొప్ప role అన్న సంగతి గుర్తుంచుకొని యీబిల్లును వ్యతి రేకించాలని కోరుతున్నాను.

*Sri M. Venkatasubba Reddi:–అధ్యక్షా! జిల్లాబోర్డులకాలపరి మితి ఒకసంవత్సరంకాలంపాటు పొడిగిస్తూ జిల్లాబోర్డులను రద్దుచేసే వుద్దే శ్యము వయోజన voting ప్రకారం జిల్లాబోర్డు నియోజకవర్గాలు పునర్వి భజించడం సాధ్యంకాదని ప్రకటించుటలో ఇది ప్రజాస్వామిక సూత్రాలకే యీమంత్రివర్గం తిలోదకాలు యిచ్చిందా అని అనుమానం వేస్తున్నది. మొట్టమొదట రాజ్యాంగ చట్టంలోనే వయోజన వోటింగు ఆస్తుల, విద్యాప్రాతి పదికలమీద కాకుండా స్త్రీ పురుష విచక్షణ లేకుండా, వయో జనులకు వోటుహక్కు సిద్ధింపచేసింది. కాంగ్రెసు 60 సవత్సరాలు పోరాడి వయోజనవోటింగు హక్కు సాధించి దేశానికి మహోపకారం చేసిందని ఊర ఊర ఉపన్యాసలిచ్చిన కాంగ్రెస్ పెద్దలే ఈనాడువయోజన ఓటింగు ప్రతిపాదికగా జిల్లాబోర్డుల నియోజకవర్గాలు విభజించడం అసంభవమని వాయిదావేయడానికి చూస్తున్నట్లున్నారు. ఇది రాజ్యాంగ చట్టానికి విరుద్ధంకాదా? అని అడుగుతున్నాను. జమీందారులనష్టపరిహారం రద్దు చేసే విషయం రాజ్యాంగచట్టం అడ్డువస్తున్నది. మద్యపాన నిషేదం తొల గించడానికి directive principles మత్తుపదార్థములను క్రమేణా అదు పులో పెట్టాలంటున్నవని అందుచేత నిషేధాన్ని రద్దుచేయుటకు రాజ్యాం గం అడ్డువస్తుందంటున్నారు. కాని ప్రజాసమస్యలను పరిష్కారం చేయ

[Sri M. Venkatasubba Reddi] [22nd February 1954

డానికి సంస్కరణలు సూచిస్తూ ప్రతిపక్షంవారు ప్రతిపాదనలనుచేస్తే రాజ్యాంగచట్టం అడ్డు వస్తుందంటారు. ఎందుచేత? ఇలాంటి సందర్భంలో మాత్రం ప్రభుత్వం ప్రజాహక్కులకు భంగం కలిగించే విధానంతో నియంతృత్వంగా ప్రవర్తించడానికి మాత్రం రాజ్యాంగ చట్టం అడ్డురాకుండా వున్నది ఎందుచేత? ఇది ప్రజాస్వామిక సూత్రాలకు విరుద్ధమని నిర్మొహమాటంగా నిర్దాక్షిణ్యంగా చార్జి చేస్తున్నాను. ఆలోచించమని విజ్ఞప్తి చేస్తున్నాను. గ్రామపంచాయితీ జిల్లాపంచాయితీ (జిల్లాబోర్డు) రాష్ట్ర శాసనసభ, కేంద్ర పార్లమెంటు ఈనాలుగు స్తంభాలపైన ఆధారపడిన ప్రజాస్వామిక ప్రభుత్వమే ఈనాడు దేశాని కవసరము. ప్రజాస్వామిక సూత్రాల ననుసరించే వుద్దేశం వున్నట్లయితే జిల్లాబోర్డుపరిపాలనలో collector ల నియంతృత్వ అధికారాలను తీసిపారవేసి ప్రజాప్రతిధులకు అధికారాలు యిచ్చి కలెక్టరేటును రద్దుచేసి, సంపూర్ణమైన అధికారాలను జిల్లాబోర్డు పరిపాలనకు ప్రజాప్రతినిధులకు యిబ్బందిలేని secretary లుగా గుమాస్తాలుగా వుంచాలని కోరుతున్నాను. Executive అధికారము ప్రజాప్రతినిధులు చేతిలోవుండాలిగాని collector ల చేతుల్లోవున్న ప్రజాప్రతినిధులపట్లజిల్లా కలెక్టర్లు ప్రవర్తించే ప్రవర్తన పాతకాలం బ్రిటిషుప్రభుత్వం నాటివలెనే వున్నది. స్వరాజ్యం కోసం పోరాడిన రోజుల్లో మొట్టమొదట స్వపరిపాలనకుమనకున్న సమర్థతను రుజువుచేసుకోడానికే యీస్థానికసంస్థలుఉపకరించాయి. 3వేల సంవత్సరాల నాగరికత పంచాయితీవ్యవస్థచాలయోగ్యంగా నడుస్తూవుండినదని రుజువుచేస్తున్నది. స్వపరిపాలనకు అర్హులమని రుజువు చేసుకున్నాం. స్వపరిపాలన మొట్టమొదట పెత్తందారుల స్వాధీనంలో వుండడంచేత ప్రభుత్వయంత్రం కాంగ్రెసుయొక్క అవినీతి పరిపాలన అసమర్థత మూలంగా నాశనం అయిపోతున్నది. మద్యపాన నిషేధం విఫలత్వాన్ని పొందింది. కాబట్టి రద్దుచేయాలంటే జిల్లాబోర్డుల పరిపాలనను సక్రమముగా సరిదిద్ది ఎందుకు నిర్వహించకూడదు? రాజ్యాంగచట్టానికి అనుగుణ్యంగా రహస్య ఓటింగు పద్ధతిపై గ్రామ పంచాయితీ ఎన్నికలు జరుపకుండా పెత్తందార్లే అధికారంలోనికి వచ్చే విధానాన్ని అనుసరించారు. ఇప్పుడు అభివృద్ధినిరోధక పంథాలో యింకా ఒక్క అడుగు ముందుకుపోయి వయోజన ఓటింగే అవసరం లేదంటున్నారీ ప్రభుత్వం.

22nd February 1954]

**The Hon. Sri P. Thimma Reddi** :-- Point of clarification తప్పుడు దోరణిలో పోతుంటే వివరించకుండా వుండడం బాగుండదని యిప్పుడు మాట్లాడుతున్నాను. వయోజన voting రద్దుపరచాలని వుద్దేశం లేదని గట్టిగా చెబుతున్నాను. వయోజన voting జరగాలంటే మామూలుగా election Revenue department సంబంధించిన గ్రామంనుంచి నిర్ణయించవలసిన అవసరం వున్నది. ఈమధ్య అనేకమైన ఏర్పాటులు జరగాలి. అందుకు చాలాకాలం పడుతుంది. 3-20 P.M.

ఇప్పటికే రివెన్యూ డిపార్టుమెంటు పైన యెక్కువభారము పడింది. ఇప్పుడు యెలెక్షన్లు జరపాలంటె చాల చిక్కులు ఇబ్బందు లున్నాయి. Adult Franchise ద్వారా యెన్నికలు జరుపబడవు అని అనుకోవడము చాలపొరపాటు.

**Sri K. Rajagopala Rao** : It is not possible to arrange for the reconstitution of the District boards on the basis of the universal adult suffrage.

**The Hon. Sri T. Prakasam**:-తిమ్మారెడ్డిగారు మరొకసారి తిరిగి స్పష్టముగా చెప్పినకూడ రాజగోపాల్ రావుగారు దీనిని మరల తిరుగదోడుతున్నారు. తిమ్మారెడ్డిగారు చెప్పిన దానిలో వయోజనవోటింగు రద్దు చేయాలని ఎక్కడలేదు.

**Sri T. Nagi Reddi** :-అంటే దానికి అర్థము వయోజన వోటింగు పద్ధతిపైననే ఎన్నికలు జరుపుతామని అర్థము చేసుకోమంటారా!

**The Hon. Sri T. Prakasam**:-- మీరేదో ఉన్నది లేనిది అంత విపరీత అర్థాలు కల్పిస్తూవుంటారు. మేము మాట్లాడేది తెలుగుభాషే. ఏ ఇంగ్లీషు ఫ్రెంచి భాషలలో మాట్లాడడములేదు. వీరికి లేనిపోని అనుమానాలు కలుగుతూవుంటాయి.

**Sri K. Rajagopala Rao**:— ఆయన చెప్పినదానిని బట్టి చూస్తే మా అనుమానాలకు ఆస్కారము లేకపోలేదు.

**The Hon. Sri T. Prakasam** :—తిమ్మారెడ్డిగారు బాగా స్పష్టపరచినారు. యీవిధముగా time waste చేయడమువల్ల ఏమిలాభములేదు.

**Mr. Chairman**:-ఇక సుబ్బారెడ్డిగారిని మాట్లాడమనికోరుతున్నాను.

[22nd February 1954

Sri M. Venkatasubba Reddy:-(contd.)మంత్రితిమ్మారెడ్డిగారు యిచ్చిన సమాధానములో రివెన్యూ ఉద్యోగస్తులు చాలఎక్కువ పనివల్ల బాధపడుతున్నారని election పెడితే వాండ్లకింక ఎక్కువ బరువగునని పేర్కొన్నారు. అయితే ఇప్పుడు ఎలెక్షన్ డిప్యూటి తహశీల్దార్లు వున్నారు. ప్రభుత్వము ఒక ప్రత్యేక ఎలెక్షన్ డిపార్టుమెంటునుకూడ నియమించినది. అందువల్ల వయోజన వోటింగు పద్ధతిపైన ఎన్నికలు జరపడానికి ఏమి ఇబ్బంది వుండదు. రాష్ట్ర విభజనఅయిన వెంటనే ఆదోని ఆలూరు తాలూకాలను కర్నూల్ జిల్లాలోను రాయదుర్గము తాలూకాను అనంతపురం జిల్లాలోను కలిపినారు. ఆరు మాసముల వ్యవధిలో ప్రభుత్వకార్యక్రమము పూర్తిచేసుకొని వయోజన ఓటింగు పద్ధతిపైన డిస్ట్రిక్టుబోర్డు ఎలెక్షన్‌లు జరుపవచ్చును. ప్రభుత్వము జిల్లాకలెక్టర్ల ఉద్యోగాలను రద్దుచేసి జిల్లాబోర్డు పరిపాలన సక్రమముగా జరుగుటకు తోడ్పడవలెను. అందుకు జిల్లాబోర్డులకు ప్రభుత్వము ఆర్థిక సహాయముచేయువలసివుంటుంది. టీచర్లకు నెలజీతాలు సరిగా అందుకుండ వుండడముచేత నానాయిబ్బందులపాలు ఔతున్నారు. ఇంక పరిపాలన పాతపద్ధతులమీదనే నడుస్తుంది టీచర్లు 49 రూపాయల జీతముతో మూడు నాలుగు మాసములకుకూడ జీతాలు రాకుండుటచేత చాలా బాధలకు గురి ఔతున్నారు. ఉన్నత ఉద్యోగస్థులగు డిస్ట్రిక్టుబోర్డు ప్రెసిడెంటు, ఇంజనీరు మొదలగువారికిమాత్రము జీపులు కొనడానికి డబ్బు ఖర్చుపెట్టుదురుకాని చిన్న చిన్న ఉద్యోగస్థులకు జీతాలు సక్రమముగా యివ్వడానికి మాత్రము డబ్బులేదంటారు. పెద్దఉద్యోగస్థులు మొదటి తేదీనేజీతాలుపుచ్చుకొందురు. వాండ్లకేమాత్రము ఆలస్యముకాకూడదు. టీచర్లు మొదలైన చిన్న చిన్న ఉద్యోగులకు మాత్రము యెప్పుడైన యివ్వవచ్చుననుకుంటారు. కనుక యీ అన్యాయాన్ని పోగొట్టి చిన్న చిన్న ఉద్యోగస్థులకు శీఘ్రముగా జీతాలు అందచేయువలెనని కోరుతున్నాను.

8-40 P.M. అందుచేత ప్రజాభిప్రాయానికి వ్యతిరేకంగా ఈ ప్రభుత్వం నడుస్తున్నదనేందుకు అవకాశం ఇవ్వకుండా ఈ విషయాలన్నింటినీ సమగ్రంగా ఆలోచించటం కోసం వెంటనే ఒక సెలెక్టు కమిటీకి దీనిని refer చేయవలసిందని కోరుతున్నాను. ఈ విషయములో ప్రతిపక్షసభ్యులకు తగినటువంటి ప్రాతినిధ్యమిచ్చి, సమగ్రమైనటువంటి, నిర్మాణాత్మకమైనటువంటి సలహాలు ఇవ్వగల సెలెక్టుకమిటీద్వారా, దీనిని

పరిష్కరించి, ప్రజాస్వామిక పద్ధతిలో వయోజన వోటింగు పద్ధతిని ఎన్నికలు జరిపి మళ్ళీ జిల్లాబోర్డులను నిర్మాణం చేయవలసిందని యికనైనా ఈ ప్రభుత్వానికి జ్ఞానోదయమగునని ఆశిస్తున్నాను. ఇంతటితో విరమిస్తున్నాను. ఈ అవకాశాన్ని నాకు ఇచ్చినందుకు మీకు ధన్యవాదాలు అర్పిస్తున్నాను.

*Sri B. Krishnamurty Rao:-అధ్యక్షా, ఈబిల్లుతో రాష్ట్రములో ఒక విపరీతమైనటువంటి వాతావరణం సృష్టించుకోడానికి ప్రతి పక్ష సభ్యులకు అవకాశం ఏర్పడుచున్నది. ఈనాడు ప్రభుత్వము Statement of objects and reasons ఇవ్వడంలో కొన్ని కారణాలు చెప్పారు. గతములో చంద్రమౌళిగారు పంచాయితీబోర్డుల చట్టము తయారుచేసి అమలులో ఉంచేటప్పుడు, తానే జిల్లాబోర్డుల రద్దుకు ప్రయత్నించడం బాగుండదని ఇంకెవరైన దీనికి ఇకముందు పూనుకుంటే బాగుంటుందనే అభిప్రాయముతో ఆ చట్టాన్ని తయారుచేశారా అని ఆలోచించవలసియుంటుంది. పంచాయతీబోర్డుల చట్టము అమలులోకి రావడంలో జిల్లాబోర్డులకు అధికారాలు ఏమిఉన్నాయి, జిల్లాబోర్డులకు రావలసినటువంటి ఆదాయము వాటికి మామూలుగా వస్తూయుండినటువంటి ఆదాయము ఎంతమట్టుకు తగ్గిపోతున్నది అనేటటువంటి విషయాన్ని ఆలోచిస్తే, గతములో నూరురూపాయలు వచ్చినటువంటి జిల్లాబోర్డుకు జిల్లాలో అన్ని ప్రాంతాలలోను చట్టప్రకారం పంచాయితీలు ఏర్పాటు చేయబడిన పిమ్మట 50 వంతుకన్నా తక్కువ ఆదాయం వచ్చేటటువంటి అవకాశం ఉన్నది. ఆదాయం ఎప్పుడైతే లేకుండా పోతుందో, అప్పుడు జిల్లాబోర్డులకు లోటుబడ్జెటులు ఏర్పడుతాయి. స్థానిక పంచాయితీబోర్డులు మార్కెటు వగైరాలలోగాని, తతిమ్మా వృత్తిపన్నులు వేసుకొని గాని, వాటిమూలముగా వచ్చేటటువంటి డబ్బును అంతకూడా వారే తీసుకొంటారు. ఇక రోడ్డుల మరమ్మతులు ఎక్కువగా Highways వాళ్లు నిర్వర్తిస్తున్నారు. సాధారణంగా చిన్న చిన్న పల్లెలకు వేసినటువంటి రోడ్లు మాత్రము జిల్లాబోర్డుల స్వాధీనంలో ఉన్నవి. ఇక వారిచేతిలో ఏమి ఉన్నది. కనీసం వైద్యశాలల విషయం చూచినట్లైతే కొన్నికొన్ని పెద్దపెద్ద ప్రాంతాలలో ముఖ్యమైన కేంద్రాలలో ప్రభుత్వము స్వయంగా వైద్యశాలలను భారీఎత్తున కలుగజేయాలని మనం ఆందోళన చేస్తున్నాము జిల్లాబోర్డులు చిన్నచిన్న వైద్యశాలలు కూడ చేయలేకుండా ఉన్నాయి. వీటన్నింటిని క్రమ

[Sri B. Krishnamurty Rao] [22nd February 1954

క్రమముగా రోజురోజుకు ప్రభుత్వము ఒకప్రత్యేకశాఖను పెట్టి స్వాధీనం చేసుకొంటు వచ్చినది. కనుక ఈనాడు జిల్లాబోర్డు చేతులలో ఏమిఉన్న దంటే ఒకElementary Education మాత్రం ఉన్నది. దానిపైన కూడ పరిపూర్ణమైన అధికారాలు వారికి లేవు. ప్రతిశాఖలో కూడ ప్రభుత్వపు ఉత్తరువు ప్రకారం శాసనసభలో తయారు చేయబడిన చట్టాన్ని అమలు చేయడానికోసం ఉద్యోగస్తులు ఉంటారు. ప్రజలచేత ఎన్నుకోబడిన సభ్యులు ఏర్పాటుచేసిన చట్టం ప్రకారం దానిని వర్తింప చేయడానికి కృషిచేస్తున్నారు. ఈనాడు జిల్లాబోర్డులలో జరుగుతున్నటువంటిది ద్వంద పరిపాలన అని చెప్పవలసియున్నది. ఇక జిల్లాబోర్డులు మరీ ఏర్పడినట్లైతే ఈనాడు ఉన్నటువంటి పరపతికూడ జిల్లాబోర్డులకు ఉండదు. అటువంటి పరిస్థితులలో ఈనాడు బ్రహ్మాండమైనటువంటి ఖర్చులుపెట్టి, వయోజన వోటింగు విధానమున ఎన్నికలు జరిపించి ఎక్కువగా డబ్బుఖర్చుపెట్టి అధికారాలు లేనటువంటి బోర్డులను ఉంచడమా, లేదా. ఈ జిల్లా బోర్డుల మనుగడకు ఏదైతే ఆటంకముగావున్నదో ఆ పంచాయితీల చట్టాన్ని రద్దుచేసి పూర్తిగా జిల్లాబోర్డుచేతికే స్థానిక అవసరాలకు సంబంధించినటువంటి పరిపాలనాహక్కును మరల ప్రసాదించడమా, ఈరెండువిషయాలను మనము ఆలోచించవలసియున్నది. ఈనాడు అనేక గ్రామాలలో పంచాయితీబోర్డులు ఏర్పాటు చేయవలసిన అవసరమున్నది. అక్కడక్కడ గ్రామాలలో ఈనాడు వయోజనవోటింగుతోనే ఎన్నికలు జరుపుతున్నారు మరొకరకంగా ఎన్నికలు జరగడంలేదు. ఎన్నికలకు ఎవరుకూడభయపడడంలేదు. అయితే, ఒకచిన్నవిషయం మనము గుర్తించవలసియున్నది. ఇక్కడ మన శాసనసభయొక్క హక్కులను వినియోగించుకొనడానికి నూతనరాజ్యాంగ విధానంప్రకారం రిపబ్లిక్ అధ్యక్షుడ్ని ఎన్నుకొనే విషయములో direct గాప్రజలచేత ఎన్నుకోబడినటువంటి మనం indirect election ద్వారా యెన్నుకొనుచున్నాము.

(Interruption by Sri K. Rajagopala Rao)

యెప్పుడు ప్రజాస్వామికం ప్రజాస్వామికం అని చెప్పేటటువంటి మీరు (పార్టీ) 20 సంవత్సరముల తరువాత ఇప్పుడు కొంతమట్టుకు అధికారములోనికి వచ్చి తరువాత 6 సంవత్సరములకు యెన్నికలు జరిపించినారు. కనుక యెన్నికలు భయము యెవరికి ఉందో అర్థం చేసుకోవచ్చు. మేము యెప్పటికికూడ యెన్నికలకు భయపడడంలేదని చెప్పుచున్నాను.

22nd February 1954] [Sri B. Krishnamurty Rao]

కనుక ఈనాడు ఇంతకుముందు పేర్కొన్న రెండు విషయాలకు సంబంధించిన మధ్యరకమైనటువంటి మార్గము ఏమైన ఉన్నదాఅని ఆలోచించవలసియున్నది. ఈనాడు, పంచాయతీబోర్డు అధ్యక్షులు, పంచాయతీబోర్డు సభ్యులు, శాసనసభ్యులు వీరందరుకూడ వయోజన వోటింగుపైనే డైరెక్టుగా యెన్నికలలో గెలిచివస్తున్నారు. కనుక వీళ్ళందరు కలసి జిల్లాబోర్డుల స్థానంలో కొన్ని అధికారాలున్నటువంటి కమిటీని ఏర్పాటుచేసి వారిచేతికి అధికారం వప్పగిస్తే బాగుంటుంది. లేకపోతే అనవసరంగా ఖర్చులుపెట్టి జిల్లాబోర్డు యెన్నికలను మరల జరిపించడంలో అర్థంలేదు. ఈనాడు జిల్లాబోర్డు ఎన్నికలలో ప్రజలకు మనము ఏమిసహాయంచేస్తామని చెప్పకొగలుగుతామనిఅడుగుతున్నాను.

ఈ నాడు ప్రభుత్వము జిల్లాబోర్డులకు చేస్తున్నటువంటి సహాయం గురించి చాలా గొప్పగా చెప్పకొంటున్నదిగాని, ఈ సహాయం చాలదు. ఇప్పుడు జిల్లాబోర్డు పరిపాలనలో ఉంటున్నది ఒక విద్యాశాఖమాత్రమే. కాబట్టి ఆ ఒక్కదానిని కూడ వారిచేతులలో ఉంచకుండా ప్రభుత్వ విద్యాధికారులచేతులలోనే ఉంచినట్లయిన విద్యావిధానము దేశములో బాగుపడుతుంది. ఉపాధ్యాయులకు కూడ ఉత్సాహం కలుగుతుంది, ఈనాడు, ఈ ఉపాధ్యాయులు ఒక ప్రక్క ఈ జిల్లాబోర్డు సభ్యుల, అధ్యక్షుల మధ్యను, మరొకవైపు డిప్యూటి ఇనస్పెక్టర్లు, డి. ఇ. ఓ ల మధ్యను నలగిపోతున్నారు. కనుక ఆ శాస్త్ర పరిపాలనకూడ జిల్లా బోర్డులనుండి పూర్తిగా తీసివేసి ప్రభుత్వ విద్యాశాఖాధికారుల చేతులలో పెట్టినట్లయితే బాగుంటుంది. తతిమ స్థానికసౌకర్యాలన్నిటికి, జిల్లాబోర్డుల స్థానంలో ప్రత్యక్షమైనటువంటి ఎన్నికలు లేకుండా, పరోక్షమైనటువంటి ఎన్నికలు శాసనసభ్యులు; పంచాయితీబోర్డుసభ్యులు, పంచాయతీ అధ్య క్షులు వీరిద్వారా ఏర్పాటుచేయించి ఒక సంఘాన్ని నియమించి వారి చేతిలోకి అధికారాలుపెట్టితే ఆ కార్యక్రమ నిర్వహణంతా బాగుంటుం దని నా సలహా.

తరువాత ఇక్కడ 'Adult Franchise'అనేపదాలు తీసివేస్తే బాగుం టుంది. మనం ప్రత్యక్షంగా ఎన్నికలు జరిపించలేక పోతున్నాము కాబట్టి, ఆపదాలను తీసివేయడం బాగుంటుంది. ఆరెండు పదాలను ప్రభుత్వమే తీసివేసుకొన్నట్లైతే చాలా బాగుంటుందని నాఅభిప్రాయము. ఇంతటితో నాఅభిప్రాయాలను వివరించడం పూర్తి అయింది. ఈవిషయంలోఇక్కడ

[Sri B. Krishnamurty Rao] [22nd February 1954

మాట్లాడడానికి అవకాశమిచ్చినందుకు తాత్కాలిక అధ్యక్షులకు అభివందనములు తెలుపుతున్నాను.

3-50 P. M.

Sri S. Vemiah:—

Mr. Chairman, ఇప్పుడు వయోజన ఓటింగు అనేది ఎంతమాత్రం భంగపరచడం లేదని చెప్పినందువల్ల, నాకుకొంత సంతోషము కలిగింది. ఇందులో వున్న అనుమానాలకు తావులేకుండా ముఖ్యమంత్రిగారు చెప్పారు. మనమిత్రుడు కృష్ణమూర్తిరావుగారు చెప్పినట్లు, ఆ అనుమానాలను తొలగిస్తూ యిక్కడవున్న సభ్యులకు వున్న సందేహాలను పోగొట్టేటట్లు చేయవలసిందిగా ప్రార్థిస్తున్నాను. అయితే, యిప్పుడు జిల్లా బోర్డు ఎన్నికలు జరపటానికి వచ్చే ఆటంకాలు, యిబ్బందులు వున్నచో, ఆ యిబ్బందులు ఏమిటో అన్నియు తెలియ జేయవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ఇప్పుడు ఆయిబ్బందులు అన్నియు తెలియ జేయటానికి టైముకాదని చెప్పడములో అర్థంలేదు. ఇప్పుడు యీ జిల్లాబోర్డులు నడపటానికి ఏవో యిబ్బందులు వస్తున్నవని చెబుతున్నారు. ఈ జిల్లా బోర్డుల జీవితాన్ని పొడిగింపు జేస్తామని చెప్పేదానికంటే, యీ జిల్లా బోర్డులు abolish చేస్తామనిన్నీ, తాలూకా బోర్డులు పెడుతామని సూచిస్తున్నారా? తరువాత పంచాయితీబోర్డులకు యివ్వదలచుకున్నారా? ఆపద్ధతి ఏమిటో వివరించమని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ఇప్పటికే జిల్లాబోర్డుల పరిపాలనా పరిస్థితులు చాలా అధ్వాన్నముగా వున్నవి. ప్రయాణ సౌకర్యాలు లేకుండా ప్రజలు అనేకయిబ్బందులు పడుతున్నారు. ఇంతవరకు జిల్లాబోర్డులకు Special ఆఫీసర్లను వేయడం కూడా జరిగింది. ఈ ఆఫీసర్లు యింతవరకు ఏమి సౌకర్యాలు చేయగలిగినారో తెలియడంలేదు. దీనివల్ల ప్రజలను మభ్యపరచడమేగాని వేరుకాదు. ఈ Spceial officers జీవితాలను యింకను పొడిగించడములో, వీరు చేయబోయే సౌకర్యాలు యేమిటో తెలియజేస్తే, సంతోషము. మిత్రుడు శ్రీ కృష్ణమూర్తిరావుగారు యీ జిల్లాబోర్డు విద్యాసంస్థలో పనిచేసే ఉపాధ్యాయులను గురించి చెప్పారు. కొన్నిచోట్ల యీ ఉపాధ్యాయులను 24 గంటలలోగా బదిలీచేయడం జరుగుతున్నది. దీనివల్ల యీ ఉపాధ్యాయులు ఎంత యిబ్బందుల పాలవుతున్నారో, ప్రభుత్వం గుర్తించాలి. ఈ బదిలీ ఆర్డరులు carry out అయ్యేలోగానే మరల cancel అయినట్లుగా కూడా మరొక order వచ్చుచుండును. ఈవిధంగా గంటకొక ఆర్డర్సు రావడం, తిరిగి cancel కావడం జరుగుతున్నది. బాధపడు

22nd February 1954] [Sri S. Vemiah]

తున్న ఒక ఉపాధ్యాయుడు ఒక దరఖాస్తు పెట్టుకుంటే, జిల్లాబోర్డుకు వెళ్ళగా, మాకు అధికారంలేదు. ఆవిషయము Education Department వారికి పంపబడిందని చెప్పడం జరుగుతున్నది. Education Department వారివద్దకు వెళ్ళితే అది మాకు సంబంధంలేదు. జిల్లా బోర్డుకు సంబంధించినదని చెప్పి త్రిప్పివేస్తారు. ఈ విధంగా యీ ఉపాధ్యాయుడు పెట్టుకున్న దరఖాస్తు ఆరునెలలవరకైనా బయటికిరాకపోగా, యీ రెండు Departments మధ్యను ద్వంద్వప్రభుత్వములోవలె యీ ఉపాధ్యాయుడు నలిగిపోవడం జరుగుచున్నది. యీవిధంగాను, యింకను ఎన్నో విధాలుగా యీ ఉపాధ్యాయుడు అనేకయిబ్బందుల పాలగుచుండడము జరుగుచున్నది. ఈవిధమైన యిబ్బందులు జరుగకుండా, ఒక విధమైన స్పష్టమైన ఉత్తరువులు జారీచేసి, అటు District Boardకున్ను Education Department వారికిన్ని మధ్య ఏవిధమైన సంబంధము లేకుండా యీ ఉపాధ్యాయులను యిబ్బందులు పడకుండాచేయాలి అని కోరుతున్నాను.

ఈ District Board పరిపాలన విషయములో మరొక విషయము మనవి చేస్తున్నాను. Hospitals విషయము తీసుకోండి. ఈమధ్య 17 వ తేదీననేను నాబిడ్డనుఅవసరంగాHospitalకుతీసుకొనివెళ్ళాను. Injection యివ్వడానికి ఆHospitalలో ఏమున్నది. యేమిలేదు. దానిని డాక్టరుగారు తీసుకొని ఎక్కడికో వెళ్ళాడనిCompounder చెప్పాడు. డాక్టరుగారు యిన్జక్షను యివ్వటానికి ఆయనవద్ద హాజరులో యేమిలేవు. Compounder అయినను యిన్జక్షను చేయుమని అడిగితే, యేమియు చెప్పలేదు. కూర్చున్నాడు. ఇందువల్ల ఆబిడ్డ యిన్జక్షను సౌకర్యముగూడ లేకుండ వుండవలసివచ్చింది. కాబట్టి హాస్పిటల్సులో ప్రజలకు కావలసిన కనీసపు ఏర్పాట్లు అయినను లేకుండా యీ హాస్పిటల్సు వుంటున్నవి. ఈ విషయాలు అన్ని చూస్తే, యీ జిల్లాబోర్డుల పరిపాలన చాల విచారకరంగ వుంటున్నది. ఈ హాస్పిటల్సు కట్టుటలో దొంగ ఎస్టిమేట్సుతయారుచేసి ప్రభుత్వపుడబ్బు యీ కంట్రాక్టర్లకు పంచిపెట్టు తున్నారేగాని, కనీస సౌకర్యాలయినను లేకుండావుండే యీ హాస్పిటల్సు యీ విధంగా నడపబడుతున్నాయని మంత్రిగారి దృష్టికి తెస్తున్నాను. రోగులచికిత్సలకు గాను అవసరమైన మందులుగూడా లేకుండా యీ హాస్పిటల్సు నడపబడుతున్నవి. ఇందువల్ల ఎంతో దూరమునుంచి ఆశపెట్టుకొని వచ్చే రోగులయొక్క స్థితి యేమగునో ఆలోచించాలి. ఈ విషయములో

[Sri S. Vemiah] [22nd February 1954

మంత్రిగారు శ్రద్ధ తీసుకొని తగు ఏర్పాటు చేయించెదరని ఆశిస్తున్నాను.

ఇక స్కూల్సువిషయము తీసుకుంటే, యివన్నియు అధ్వాన్న పరిస్థితులలో నడపబడుతున్నవి. స్కూల్సు బిల్డింగ్సు విషయములో శ్రీమంతులు డబ్బు ధర్మంగా యిచ్చారు. ప్రభుత్వంవారు కొంతడబ్బు యిచ్చుకొంటూరు. పాతబిల్డింగ్సు ఎంతోకాలంగా రిపేర్లులేక శిథిలావస్థలో నుంటున్నవి. ఎంతో ఆందోళన చేయగా ఏవో కొద్ది రిపేర్లతో కాలము గడుపుతున్నారు. ఈ బిల్డింగులన్నియు ప్రభుత్వము స్వాధీనము చేసుకుంటే బాగుంటుందని మనవి చేస్తున్నాను. కారణము యేమిటంటే జిల్లాబోర్డులకున్నూ, యింజనీర్లకున్నూ మధ్య సహకారభావం లేనందువల్ల యీ స్కూళ్ల బిల్డింగులు యీపరిస్థితులలో వుంటున్నవి. ప్రజలు డబ్బు యిస్తున్నప్పటికిని. యీ డబ్బును కంట్రాక్టర్లద్వారా, దుర్వినియోగము చేయబడుతున్నది. ప్రభుత్వమువారు యీవిషయములో తగు శ్రద్ధ వహిస్తారని ఆశిస్తున్నాను.

(At this stage, Mr. Speaker resumed the chair.)

ఇక యీస్కూళ్లలో పనిచేసే ఉపాధ్యాయుల విషయం ఆలోచిస్తే వీరికిచ్చే జీతాలలోను, Elementary Schools లోను, Secondary Schools లోను ఉపాధ్యాయులు చేసే పనిలోగూడా చాలా తేడా వుంటున్నది. ఈ Elementary schools లో పనిచేసేవారికి, పని ఎక్కువగా చేస్తున్నవారికి, తక్కువగా జీతములు యివ్వడం, secondary schools లో పనిచేసేవారికి, తక్కువ పనిచేస్తున్నవారికి, ఎక్కువ జీతములు యివ్వడము జరుగుచున్నవి. ఈ తేడాలను మంత్రిగారు నిష్పాక్షిక దృష్టితో పరిశీలించి, తగిన చర్య తీసుకుంటారని ఆశిస్తున్నాను.

మా నెల్లూరు జిల్లా రాపూరుతాలూకాలో మలేరియా ఏరియాలో పనిచేయుచున్న ఉపాధ్యాయులకు మలేరియా allowance యిప్పటికి మూడు సంవత్సరాలుగాయిస్తూ మలేరియా allowance నుయివ్వకుండా మానివేశారు. ఎన్నిపర్యాయములు మొరపెట్టుకున్నప్పటికిన్ని ఆయన సంగతి ఆలోచించకుండా కాలయాపనచేస్తూ వస్తున్నారు. ఈవిధమైన మలేరియా allowance యివ్వవలసిన ఉపాధ్యాయులకు త్వరలో allowance ను యిప్పించేటట్లుగాను, యికమీదట గూడ చిక్కులు లేకుండా యివ్వగలందులకు, మంత్రిగారు ఉత్తరువులు జారి చేయించ గలందులకు మాకుహామీయిస్తారని ఆశిస్తూ యింతటితో ముగిస్తున్నాను.

22nd February 1954]

Sri R. Siddanna Gowd:-- అధ్యక్షా, ఈ District Boards (Amendment) Bill, District Boards term ముగిసే ఆఖరులో వచ్చిందంటే నాకు చాల విచారకరంగావుంది. ప్రభుత్వమువారు District Boards term ముగిసి పోవచ్చిందనే విషయం యిప్పటివరకు anticipate చేయలేదా ? ఎందుకు యీ Bill యిక్కడ term ఆఖరు కావడంలోనే, జనవరి మాసంలోనైనా తేలేదే? 31 వ మార్చినుండి యింతోఎంతో మటుక్కు District Boards term అవసరముగా పొడిగించుటకు పూనుకొన్న యీ ప్రభుత్వము ఫిబ్రవరి ఆఖరు వరకు ఆలస్యంచేశారే! ఇది ప్రజాస్వామికమా ? ఇది న్యాయమా ? సమంజసమా ? ఈ బిల్లు యీ ఆఖరునపెట్టి, ఒక సంవత్సరం వరకు పొడిగించకపోయినను, ఆకాలపరిమితిని కొంతవరకు 4, 3 మాసాల వరకైన వుంచుటకు యిచ్చిన సవరణాలు, ఆ సవరణకు అవకాశం యివ్వని యీ ప్రభుత్వము, యిది ప్రజాస్వామిక పరిపాలన అనిపించు కొంటుందా ? ఇది ప్రజాస్వామికమునకు అనుగుణమా ? సమ్మతమా ? ఇది ప్రజాస్వామికమునకు అనుగుణంగా congress ప్రభుత్వముతో కూడిన యీ ప్రభుత్వము అంత దీనికి అనుగుణంగా వారు వర్తిస్తున్నారా ? అని నేను మొట్ట మొదట అడుగు తున్నాను. ఇకపోతే రెండవ విషయం యేమిటంటే Opposition వారికంటె, District Board పరిపాలనను, కాంగ్రెసు వారిచేతులలో పరిపాలనవున్నమనలోకల్ ఎడిమినిస్ట్రేషను మంత్రిగారు తీవ్రంగాఖండిచారు. వారికంటె తీవ్రంగా opposition వారు కూడఖండించి వుండియుందురు మంత్రిగారీవిధంగాఖండించుటంలో State government నేఖండిచటమే కాదా? వారుఅనంతపురం, చిత్తూరు, జిల్లాబోర్డులను వుదహారణాలు గా తీసికొని, వారిపరిపాలన యెంతమాత్రమూ సమర్థ నీయింగాలేదని, అవి deficit budget లోవుండి ట్రజరీలనుండి ఎక్కువ అదనపుడబ్బును వారు Draw చేశారని చెప్పారు. అటువంటప్పుడు ఇందుకు ప్రభుత్వము యేమిచేస్తున్నారు ? జిల్లాబోర్డులు ఆ విధంగా Draw చేస్తూంటే, ఆ treasury officers యేమి చేస్తున్నారు? వారు excess draw చేసినందులకు ప్రభుత్వము యేమి చర్యతీసుకొన్నది ? అంతే కాకుండా జిల్లాబోర్డుల పరిపాలన Congress వారిచేతులలో వుండగా, అందుకు మన local administration మంత్రిగారు కూడా, దీనికిబాధ్యులని గుర్తించారా ! వారు A. P. C. C. Vice President గావుండి. వారు అవినీతి పరులను. అసమర్థులైన వారిని జిల్లాబోర్డు మెంబ

4-0 P.M.

[Sri R. Siddanna Gowd] [22nd February 1954

రుగా సెలెక్టు చేయలేదా ? అనంతపురం జిల్లాలో సంజీవరెడ్డి పార్టీ ఒకటి, వేమారెడ్డి పార్టీ ఒకటి వుండలేదా ? వేమారెడ్డిగారు జిల్లా బోర్డు ప్రెసిడెంటుగా నుండుటకు వారికి కావలసిన మెంబర్లను నియామకం చేసి, వారి ఎన్నికకు వారు దోహదం యివ్వలేదా ? ఇప్పటి Local administration మంత్రిగారు యీ దుష్పరిపాలనకు బాధ్యులని నేను మనవి చేస్తున్నాను. మరొకవంక అధికారములో non-official presidents వుంటూ వారు అధికారాన్ని దుర్వినియోగ పరుస్తూంటే, మరొకప్రక్క Executive Officers లంచగొండులైనందున, వారి పరిపాలనలో యెక్కువ defalcations అవుతూ, ఈ Executive officers మధ్య ఆ Non-official presidents మధ్య సహాకారము సమకూర్చుటకు opposition party పెట్టిన ఒక సవరణను తెచ్చుటకు వీలులేదనిన యీ ప్రభుత్వమువారిని యేమనాలో నాకు అర్థం కాకుండా వుంది. మన local administration మంత్రిగారు మాట్లాడుతూ పంచాయితీబోర్డుల పరిపాలన సరిగా జరగడంలేదని పన్నులు వసూలు సరిగా సక్రమంగా జరగడంలేదనీ, అందుచేత వాటి అధికారమును revenue department కు hand over చేయమని చెప్పారు. దానిలో సత్యము లేకపోలేదని నేను local administration minister గారికి చేయూత నిస్తున్నాను. Executive Officers లో ముగ్గురు అవినీతిపరులు వున్నారు. ఈ ముగ్గురికాలంలో defalcation జరిగింది. వారిపై నేను రిపోర్టులు వ్రాశాను. అవి యెక్కడవున్నాయో తెలియదు. ఇప్పటికి బయటకు రాలేదు. వాటిపై action యేమి తీసుకొన్నారో తెలియదు. అంతకంటెఆExecutive officersమీద యేవిధమైన దర్యాప్తుజరుగలేదు. పూర్వము ఈ Executive officers ను qualified వారిని select చేసి వారికి మొదట training యిస్తూండేవారు. Congress ప్రభుత్వము వచ్చినతరువాత యిప్పుడు సిఫార్సులపై వారు వస్తున్నారు. ప్రభుత్వం సిఫార్సులనే patronise చేస్తున్నారు. Summary training అయినవారిని Educational qualification ను బట్టి వేయడంలేదు. వెనుకటి కాలములో District Boards పరిపాలన చూచినట్లైతే, ఎంతో బాగుండేది. రామచంద్రరావుగారు, కె. కుప్పుస్వామి చౌదరిగారు మొదలైన పెద్దపెద్దనాయకులు, వారు పంచాయితీ బోర్డులు మెంబర్లనుండి, District Board ప్రసిడెంటు పదవుల వరకు అలంకరించారు. ఇప్పుడుఒకేసారిDistrict Presidentగా రావాలి. సుస్థిర పరిపాలన అక్కర

22nd February 1954] [Sri R. Siddanna Gowd]

లేదు. జిల్లాబోర్డు పరిపాలనా అనుభవము వుండినా లేకపోయినా, ఒక్కసారిగా పైకి రావలెననుకుంటున్నారు. అనుభవము, training, సమర్థత వున్న లేకపోయినా, ప్రజాతంత్ర పరిపాలన చేతపట్టుకొనడానికి కారణం, అనుభవం లేనివారిని వేయటమే వారికి యేదో ఒక మార్గం అన్వేషించడానికి Education Minster గారు advice యిచ్చి వుంటారు. అక్కడ ఒక తీర్మానం కూడ జరిగింది. Executive officers ను తీసివేయమన్నారు. ఇవి ప్రజాస్వామికమా ? కాక ప్రజాముఖమా? అని నేను అడుగుతున్నాను? Non-official president గా సరిగా జవాబు చెప్పే బాధ్యత వహించాలని అంటున్నాను. ఒక గుమాస్తాగిరి ఖాళీపడినపుడు, దానికి 20 దరఖాస్తులు వస్తున్నాయి. దానికి అనేకమంది మెంబర్ల సిఫార్సులు వస్తాయి ఒకపనికి Contract యిచ్చే విషయంలో Tenders call for చేస్తే, Tenders force చేసి యిప్పించమంటారు. పైగా back date వేయమంటారు. కాబట్టి Executive officers వేయవలసివుంటుంది. ఈ విషయంలో ప్రభుత్వంవారు వారికి కావలసినవారిని అర్హతవుండనీ లేక పోనీ మెజిస్ట్రేటివు ఆఫీసర్లుగ వేస్తారు. వారికి సర్వాధికారులు వుండబట్టి వారు office కు 11 గంటలకే రావాలంటే వారు రారు వూరుబయటsanitationమొదలైన పనులుతనఖీచేయవలసివస్తుంది. కాబట్టి వారు ఆఫీసులో పనిఏమి చేస్తారు? President గాని మెంబర్లు గాని వారి అధికారములు సక్రమంగా నిర్వాహించే టట్లుచేయడంలేదు. వారు office కు రారు. నేను M. L. A. గా నుండి చాల సమర్థతతో సక్రమంగా పనిచేస్తూంటే మిగిలిన వారు యేమి చేస్తున్నారు? కాబట్టి Non-official presidentsకుExecutive officersకు పూర్తిఅధికారాలు యివ్వకుండా, వారిపై supervising control వుంచండి. చిన్న ఆఫీసర్లను పంచాయితీ బోర్డులకు వెయ్యండి.

ఇక District Boards విషయానికి వస్తాను. మా మిత్రులు కృష్ణమూర్తిరావుగారు చెప్పినట్లుగా దానిని నేను సంతోషపూర్వకంగా బలపరుస్తున్నాను. ఎలిమెంటరీ విద్యావిధానము పల్లెలలో సక్రమంగా బోధించబడడములేదు. నేటికీ విద్యావ్యాప్తి జరుగలేదు. గ్రామ గ్రామాల్లో వుండే Elementary schools ఒకే District Board క్రిందవుండి, వాటిపై supervision తరచుగా జరుగనపుడు, వాటిని కేంద్రీకరించి, తాలూకాబోర్డుల ఆధీనములో వుంచడం మంచిది. ఈ జిల్లాబోర్డుల పరిపాలన వచ్చిన తరువాత, పరిపాలన పూర్తిగా చెడి

[Sri R. Siddanna Gowd] [22nd February 1954

పోయింది. ఒక్కొక్క జిల్లాబోర్డుక్రిందవుండే 800 స్కూళ్ళను ఒక్క Educational officer కు తనిఖీచేయుట సాధ్యమా? 200 మైళ్ళుప్రయాణము చేస్తున్నాడేకాని, జిల్లాబోర్డు క్రిందవుండే Elementary schools యెన్నివున్నాయో hospitals యెన్నివున్నాయో రోడ్లు యెన్నివున్నాయో తెలిసిన జిల్లాబోర్డు Presidents ఎవరైనా వున్నారా! ప్రజాప్రభుత్వము అనిచెప్పుకునే దేశనాయకులు, పెద్దలందరూ జిల్లాబోర్డుల Presidents గా వస్తున్నారే? వారు చేయవలసిన పరిపాలనా విధానమేనాయిది? ఇదివరలో శ్రీ లక్ష్మీరెడ్డిగారు, రాయప్పగారు, పిళ్లెగారు మొదలైన వారంతా సక్రమంగా ఒక ప్రోగ్రామ్ వేసుకొని, ప్రజాహితదృష్టితో అనేక ప్రయాసలుపడి, దూర ప్రయాణాలు చేసినారే అటువంటి వారేలేరా? రాజ్యాంగ చట్టము ప్రకారము Directive principles ప్రకారము, మన మంత్రులు పరిపాలనలో ప్రజలను విద్యావంతులుగా చేయమంటే, వారు తగిన వారిని యెన్నుకొనుటకు యీ Elementary విద్యావిధానమును provincialise చేయండి. డైయార్కి పెట్టకండి, అని యెన్నోపర్యాయాలు చెప్పాను. అంతేకాకుండా, యీ పాఠశాలలో విద్యావిధానము యెట్లు నడచుచున్నదో తనిఖీచేయడం జరుగుటలేదు. కాని జిల్లాబోర్డు ప్రసిడెంట్లు వారికి వ్యతిరేకులైన వుపాధ్యాయులను తరచు బదిలీ చేస్తున్నారు. ఈ మధ్యవారికి Post office duty అదనముగా చేస్తూన్నందులకు వచ్చుచున్న 25% అలవెన్సు కూడ యివ్వడం లేదు. వీటికి నియమించడంలో, ఒక్కొక్కదానికి 20 సిఫార్సులు వస్తున్నాయి, క్రొత్త ప్రశిడెంట్లు తనపనులను సక్రమంగా నిర్వహించడంలేదు. Elementary schools లో యే విధంగా జరుగుచున్నదో అదేవిధంగా High schools లోను జరుగుచున్నది. ఈ Elementary schools లో యిప్పుడున్న విద్యావిధానము తీసివేయండి. జిల్లాబోర్డులకు యిటువంటి పరిస్థితులలో యేమి పని వుంటుంది. తాలూకాబోర్డులకు కాని ఏమిపని వుంటుంది. అందుచేత రాష్ట్రమంతట ఏమిచేయాలంటే, ప్రతీగ్రామంలోను బడులను నెలకొల్పి సక్రమమైన పద్ధతులలో, నడిపించాలి. అట్టి మంచిపద్ధతులలో మంచి వుద్దేశ్యములతో వుల్లాసముతో, ప్రతి గ్రామంలోను విద్యాబోధన క్రమము నడిపించి, ప్రజలను విద్యావంతులుగా చేయాలి.

పెద్దపెద్ద పంచాయితీలలో ఎన్నికలుజరిగాయి, చిన్నచిన్న పంచాయితీలలో మాత్రం ఎన్నికలు జరుగలేదు. అన్ని పంచాయితీలలోను ఎన్ని

కలు జరిగివుండవలసింది. పెద్ద పంచాయితీలలో మాత్రమే ఎందుకు జరిపారు? ప్రభుత్వంవారు చిన్నచిన్న పంచాయితీలకుకూడా elections ను పెట్టాలి. ఇంక పంచాయితీల నిర్వహణాల విషయంలో ప్రభుత్వం వారు District Panchayat Officers ను వేస్తున్నారు. అలాకాకుండా పంచాయితీలను నిర్వహించుటకు ex-officio లను వేసినట్లయితే బాగుంటుంది. అసలు మనరాష్ట్రంలో యిపుడు పంచాయితీల, జిల్లా బోర్డుల నిర్వహణ చాలాలోపభూయిష్టంగా వుంటున్నది. అందుచేత కొన్ని కొన్ని పంచాయితీలకు M. L. A. లను ex-officio membersగా నియమించి వాటి నిర్వహణబాధ్యతను వారికి అప్పచెప్పినచో బాగుగా వుంటుందని నాయభిప్రాయము. ఇప్పుడు పంచాయితీ పరిపాలన సరిగాలేదు పంచాయితీలు స్థానిక స్వపరిపాలన సంస్థలు అన్నపేరునకు త గి న ట్లు గా ప ని చే యు ట లే దు. చిన్న చిన్న పంచాయితీలకుకూడా Executive officers ను appoint చేయవలయును. పంచాయతీబోర్డులకు, విద్యా, వైద్య సౌకర్యముల విషయంలో అధికారం యివ్వాలి. తరువాత hospitals, roads మొదలైన వాటి విషయంలోను, Revenue, Police Administration ల లోను పంచాయితీబోర్డులకు కొన్నిహక్కులను యివ్వాలి. యిచ్చినట్లైతే పంచాయితీ బోర్డులు ఉన్న ప్రాంతాలలో విద్యా, వైద్య సౌకర్యములు బాగుగా ప్రజలకు అందుబాటులో నుండగలవు. అపుడే ప్రజలు అందరకు సక్రమంగా అందుబాటులో ఉండి ప్రజాసంతృప్తికై పంచాయితీ బోర్డులు సరియైన పాత్ర వహించగలవు. ఇక రోడ్లవిషయంలోకూడా పంచాయితీబోర్డులకు కొన్ని హక్కులను యివ్వాలి. రోడ్లవిషయంలో వాటిని వేయుటకు పంచాయితీవారు Highways శాఖవారి సహాయం లేకుండగనే వీరికి సంబంధించిన రోడ్లను నిర్మించుకోడానికి కొన్ని హక్కులను యి వ్వా లి. పంచాయితీలకు Revenue ఆదాయంలో ఇది వరకటికంటె హెచ్చుభాగం యిచ్చి, కొన్ని Revenue అధికారములను యివ్వవలయును. పంచాయితీ బోర్డులను Non-official ex-officio ఆధ్వర్యంక్రింద ఉంచడం మంచిది. M. L. A. లను, ఇతర ex-officio లను ఆయాప్రాంతాలలో ex-officio committee గా ఏర్పాటు చేసినట్లైతే అవిచాలా సమర్థనీయంగా ప్రజారంజకంగా, ప్రజలకు సౌకర్యములను కల్గించగల్గడానికి, అవకాశం వుంటుంది. అపుడు ఈ ప్రభుత్వం ప్రజాదరణను చాలా సులభంగా పొందగలదు. ఇలా చేస్తే

[Sri R. Siddanna Gowd] [22nd February 1954

భాగావుండునని నేను మనవి చేస్తున్నాను. వీరికి Hospitals మీాద సర్వాధికారములు, స్థానికంగా ఉండె పోలీస్ administration లో వీరికికొంతఅధికారం యివ్వాలి. ఇల్లా చేసిననాడే స్థానిక స్వపరిపాలన అని పేరుకు తగినట్లుగా స్థానికసంస్థలైనటువంటిపంచాయితీల ద్వారా పరిపాలన జరుగుతుంది. ఈపనులనన్నింటినీ పంచాయితీబోర్డులకు అప్పజెప్పి వాటిని ex-officio committee ఆధ్వర్యంక్రిందఉండడం మంచిది. పంచాయితీల ప్రసిడెంటులు ex-officio కమిటీఅజ్మాయిషీక్రింద ఈవిధమైనహక్కులు కలిగి, సక్రమంగా ప్రవర్తించినట్లైతే పంచాయితీబోర్డు పరిపాలన ప్రజా రంజకంగా రాష్ట్రం అంతటా ప్రజాదరణ పొందగలదనినేను ఖచ్చితంగా చెప్పగల్గుతున్నాను. నేను ఎందువలన ఈవిధంగా చెప్తున్నానంటే నాకు ఈపంచాయితీబోర్డుల విషయములో అనుభవంవున్నది. నేనునా స్వంత అనుభవంతో ఈవిషయములను చెప్తున్నాను. నేనుకూడ 5, 6 సంవత్సరములనుంచి పంచాయితీబోర్డులో బాధ్యత వహించాను. నేను పంచాయితీబోర్డు మెంబరునే. అందుచేతనాకు అందు అనుభవముకలదు. తరువాత M. L. A.గా కూడా నేనుబాధ్యత వహించుచున్నాను. ఎల్లప్పుడూ నా బాధ్యతను నేనుసక్రమంగా సవ్యంగా నిర్వహించుచున్నాను. పంచాయితీ బోర్డులు ఇప్పుడు Inter-dependants గా వుంటున్నాయి అందుచేత పంచాయితీ బోర్డులకు సమస్తసౌకర్యములు జరుపుటకు కొంత అడ్డంకుఉంటున్నది అందుచేతపంచాయితిబోర్డులను Inter-dependants గా ఉండకుండా వాట్లకి కొన్ని ప్రత్యేకమైన హక్కులు యివ్వవలయును. Inter-dependants అంటే పంచాయితీ బోర్డువారు ఏపని చేయాలన్నా ప్రసిడెంట్ సర్కారువారి అనుమతినిపొందాలి. వారిసహాయమును అర్థించాలి అందువల్ల పనులు జరుగుటకు కొంచెం అలస్యమగుచున్నది. అందుచేత ప్రజలకు సరిగా సౌకర్యములు జరుగుటలేదు. ఉదాహరణకు ఏదైనారోడ్ను వేయించాలి అంటే వారు హైవేస్ department వారిని కోరాలి. అపుడువారు ఏ 50 వేలకో ఆరోడ్డును sanction చేయడానికి తిరిగి Government కు requisition పెట్టుకోవాలి. పెట్టుకుంటే దానికి గవర్నమెంట్ Sanction చేసి ఆపనిఅయ్యే లోపు నచాలా కాలంఅవుతుంది. ఈవిషయములనన్నింటిని నేను నాస్వంత అనుభవమువల్ల చెప్పుచున్నాను. అందువల్లనే పంచాయితీబోర్డుల శాసనమునకు నేను చాలా సవరణలు తయారు చేశాను. వాటిని నెల్లూరులో జరిగిన పంచాయితీఅధ్యక్షుల మహాసభముందు ప్రవేశపెడదా

22nd February 1954] [Sri R. Siddanna Gowd]

మనుకున్నా, కాని వ్యవధిలేక అచ్చట ప్రవేశపెట్టుటకు అవకాశంలేక పోయింది. అందుచేత వాటి విషయమై తీర్మానములకునోటీసుయిచ్చియున్నాను. పంచాయితీలకు 1950వ సంవత్సరంలో sign election లుతీసుకున్నారు. కానిఇంతవరకు వయోజనపద్ధతిపై voting మేజర్ పంచాయితీలకు జరిపారు. కాని చిన్నచిన్న పంచాయితీలకు మాత్రంజరుపలేదు. ఇపుడు మనరాష్ట్రంలో జిల్లాబోర్డుల పరిపాలన, వాటినిర్వహణ ఏమీబాగుగా లేవు. కేవలం వాటి President లు స్వార్థపరులై వాటి పరిపాలనను చెడ్డగా చేసి వేసినారు. పంచాయితీలుకూడా కొన్నిఆలాగునే ఉన్నాయి. అందువల్ల పంచాయితీలను non-official ex-officio committee ల ఆధ్వర్యంక్రింద నుంచినట్లైతే మంచిది. ఇప్పుడు ఎక్కడ చూసినను జిల్లా బోర్డులు మొదలైనచోట్ల అంతా అభిప్రాయభేదాలతోనే ఉండడం వల్లను, స్వార్థపరులై యుండుట వల్లనూ ప్రజలకు ఏమాత్రం న్యాయం జరుగుటలేదు. నేను ఇంత emotional గా మాట్లాడుతున్నాను, నేనేదో revolutionist నని, అనుకుంటారేమో కాని నేను మాత్రం అలాకాకుండా ప్రజాశ్రేయస్సు దృష్ట్యా ఈవిషయముల నన్నింటిని చెప్పుచున్నాను. ప్రజావసరములకు ఎంత మాత్రం ఇటువంటివి స్థానిక స్వపరిపాలనా సంస్థలు అనే పేరుకు తగినట్టుగా పనిచేయలేని కారణమువల్ల, కేవలం అందు భిన్నాభిప్రాయములతో నుండుటవల్లను ప్రజావసరములైన పనులేమియూ జరుగుటలేదు. అందువల్ల నేను బాధపడుతూ నాహృదయ కుహరంలోనుండి వచ్చిన బాధను వెల్లడిచేయుచున్నానంటే నేను ఈపంచాయితీ విధానాన్ని local boards విధానాన్ని మైసూరులో ఏవిధంగా నున్నదోనని చూచితిని. కాని వాస్తవికదృష్టితో చూస్తె అచ్చటకూడా ఈ విధానం ఏమంత సంతృప్తికరంగా లేదు. అచ్చటకూడా పంచాయితీ Administration ఏమీ బాగాలేదు. ఇప్పుడు దేశంలో ఎక్కడచూచినా అవినీతి. హెచ్చుపెరిగిపోయి ఉన్నది. భారతదేశంలో ఇప్పుడు మహాత్ముని యుగంలో ఉన్నాకూడా త్రేతాయుగంలోవలె ఎక్కడచూచినను అవినీతి, అన్యాయం, నీచత్వం, స్వార్థపరత్వం ప్రబలిపోయెను. వాటిని యిపుడు మనం నిర్మూలించటానికి ప్రయత్నించాలి. ఈ విషయములన్నింటిని ఈ సభముందు జెప్పనవసరములేదు. ఇక్కడ మీకందరికి తెలిసియేయున్నవి. ఇటువంటి పరిస్థితినుండి మన స్థానిక సంస్థలను చక్కబరచవలసిన అవసరంఉన్నది. పంచాయితీలకు ఇదివరకటి

[Sri R. Siddanna Gowd] [22nd February 1954

కంటే యిప్పుడు అన్నివిషయాలలోను హక్కులను ఎక్కువచేసినట్లైతే చాలా బాగుంటుందని నాఅభిప్రాయం. నాకు అవకాశమిచ్చినందుకు అధ్యక్షులవారికి వందనము లర్పించుచూ యింతటితో విరమిస్తున్నాను.

Mr. Speaker: The Question is:

That the Madras District Boards (Amendment) Andhra Amendment Bill be taken into consideration at once.

The motion was carried.

Mr. Speaker: Hon. Members who have tabled amendments will move them and have them seconded and we may continue general discussion as well as the discussion on the amendments. I have waived the notice period for the amendments and I will allow all the amendments moved by hon. Members if they are otherwise in order.

Sri V. Srikrishna: I move:

"for the words "31st March 1955", the words "30th May 1954" be substituted."

The amendment was duly seconded.

Sri M. Hanumantha Rao: I move:

"for the words "31st March 1955" substitute the words "30th June 1954".

Sri K. Venkayya seconded the amendment.

Sri B. Sankarayya: I move:

"for the words "31st March 1955", substitute the words "30th April 1954".

The amendment was duly seconded.

Sri D. Seetharamayya: I move:

(i) "for the words "31st March 1955" substitute the words "1st July 1954".

(ii) Add the following at the end of clause 2:

"Elections will be held for the District Boards by 1st July 1954".

4-20 P.M. Sri Vavilala Gopalakrishnayya:

(i) For the words 31st March 1955 substitute the words "30th March 1954";

(ii) "For the words '31st March 1955', substitute the words '1st May 1954'.

Sri Vavilala Gopalakrishnayya :— Statement of objects and reasons లో మొదటి amendment కనుక అంగీకరించబడితే అట్టి amendment clause క్రింద వస్తుంది.

22nd February 1954]

Mr. Speaker :—There is only one clause before the House, namely, that the time be extended till 31st March 1955. There may be amendments to this. But any new clause to be added means practically a new bill; it cannot be called an amendment. Therefore I cannot allow it.

* Sri Vavilala Gopalakrishnayya:—1954 మార్చి 30 తేదీ ఒప్పుకొంటే వెంటనే ఎలక్షన్సువస్తాయి. ఈ పద్ధతిలో జరిగేట్టయితే జిల్లా బోర్డుల పరిపాలన ఏవిధంగా జరగాలనే విషయండుంది. రేపువచ్చే జిల్లా బోర్డులకు సర్వాధికారాలు ఇచ్చి Executive Officers ను తొలగించి ఎన్నికైనవారిద్వారా పరిపాలన జరిపించాలి. అదినేను amendment రూపంలో పెట్టాను. objects and reasons లో అనేకకారణాలు చూపెదరు. కావున ఏ ఏ కారణాలవల్ల ఈ amendment పెట్టవలసి వచ్చిందో చెప్పడం అవసరం కాబట్టి దాన్ని ఇక్కడ వివరించడానికి నాకు అధికారం ఉంది. అందుచేత ఆ amendment correct అని నేను మనవి చేస్తున్నాను.

Mr. Speaker :—Addition of a new clause not in order. I rule it out.

Sri T. Lakshminarayana Reddi :—I move Sir.

"For the words '31st March 1955' substitute the words '31st July 1954".

Sri G. Bapanayya :—I second the amendment.

Sri M. Venkatasubba Reddi :—I move, Sir.

" (1) that the Bill be referred to a select committee.

Mr. Speaker :—The stage at which the amendment 'that the Bill be referred to a select committee' is to be moved, has already gone. We are now at the stage of consideration of the Bill clause by clause.

Sri M. Venkatasubba Reddi :—Sir, I Move.

(ii) that for the words "31st March 1955" substitute the words "30th September 1954"

Sri R. Siddanna Gowd :—అధ్యక్షా! ఈ తీర్మానాన్ని నేను బలపరుస్తున్నాను.

Sri T. Nagi Reddi : We have not yet finished the general discussion, and that means that we have not reached the stage of discussing the Bill clause by clause. First of all we must finish the general discussion and then we should take up the clauses and the amendments thereto.

Mr. Speaker : It is only for the convenience of the hon. Members that I have allowed also the general discussion along with the discussion of amendments, but technically that stage of general discussion is over. I put that question to the House and I said that I took it that the House agreed that the Bill be taken into consideration at once. Therefore we have gone to the next stage and I asked for the amendments to the clause to be moved.

Sri T. Nagi Reddi : Your previous announcement was taken by us to mean that the general discussion will continue. So naturally we expected that after the general discussion was over, the Government would reply explaining the purpose of bringing forward this Bill and then we would have an opportunity to reply to the Government. After the question is put to the vote of the House, we discuss the Bill clause by clause. That has been the procedure adopted so far in the Composite State and also I believe in this State. I thought that at the end of the general discussion I would have a chance to speak on the generel principles of the Bill.

Sri Vavilala Gopalakrishnayya :— ఒకబిల్లు తెచ్చినప్పుడు ఆబిల్లుపై సవరణలు తీసుకురావచ్చు అయితే first reading మాత్రం ఇప్పుడు జరుగుతున్నది.

Mr. Speaker :—I took the sense of the house already and technically, that stage is now over. So let us proceed with the amendments. For the convenience of the hon. Members I said that I was prepared to allow a sort of general discussion along with the discussion of amendments.

Does the hon. the Leader of the Opposition want the general discussion to go on for some more time?

*Sri T. Nagi Reddi:- నేను మీదృష్టికి తేవలసిందేమంటే general discussion close చేస్తాం అని అంటే దానికి ముందు Government side నుంచి రిప్లై ఇవ్వతలుచుకుంటే ఇవ్వడానికి ప్రతి పక్షమునుంచి నేను మాట్లాడ దలచుకొంటే మాట్లాడటానికి అవకాశం వచ్చిన తరువాత general discussion close చేస్తాం. అట్లానే opposition side న కూడా ఎవరైనా అనుకుంటారు. నేనుగాని, మంత్రిగారు కాని మాట్లాడడము లేదంటే అప్పుడు దానిని close చేయవచ్చు. నేను ఇంతవరకూ బైటఉన్నాను. మీరులోపల ఉన్నారు. సడెన్‌గా general discussion close చేసినట్లు అనుకోలేదు. అనుకుంటే అప్పుడే objection raise చేసేవాడిని. అందుచేత ఇప్పుడైనా మించిపోయిందిలేదు. general discussion కొనసాగించ మని కోరు తున్నాను. నేను ఇంతకు ముందుచెప్పినట్లు General discussion చేసే

22nd February 1954] [Sri T. Nagi Reddi]

పర్సన్ వేరేఉంది. అందుచేత general discussion ముందు మేము close చేయటం మంచిది. ఆ విధంగా కొనసాగించడం న్యాయము సక్రమము అనిపించుకుంటుందని నేను చెప్తున్నాను.

Sri Vavilala Gopalakrishnayya :— న్యాయంగా ఏ ఏ amendments అయితే ప్రతిపాదించారో ఒకేసారి వాటన్నిటి మీద discuss చేసేవాళ్ళం. సౌకర్యంకోసం ఈవిధంగా చేశాం. అందువల్ల ఈ amendment కూడా stand అవుతుందని, కాబట్టి దీన్ని allow చేయాలని మనవి చేస్తున్నాను.

Sri Pillalamarri Venkateswarlu :—The Bill be taken into consideration అనేది కూడా ఓటింగుకు పెట్టడం, ఆ తరువాత ఇంకో స్టేజీలోకి పోవడం అనేది మనం అవలంబించే ప్రొసీజరు. దాని ప్రకారం చేయాలని కోరుతున్నాను.

The Hon. Sri T. Viswanatham :—మీరు చెప్పింది కూడా వాస్తవం. I take it అనికూడా చెప్పారు. House ప్రిపేరు అయిలేదు. అదీ కాకుండా చాలామంది జనరల్ discussion మీద మాట్లాడ్డానికి అవకాశం ఇమ్మంటున్నారు. కాబట్టిఅలా ఇచ్చినప్పటికి మాఅభ్యంతరం లేదు.

Mr. Speaker:-But what about the proceedings? What I have said has already gone into the proceedings. How can the cinema reel be taken back? I cannot allow it. Rightly or wrongly I said that the House allowed me to take it that the second reading is passed. If I alter it, the proceedings will become irregular.

Sri Pillalamarri Venkateswarlu :—ఇప్పుడు మీరు చెప్పిందంతా నిజమే. The Bill should be taken into consideration అని చెప్పేది. ఇంకోకపద్ధతి అవలంబిస్తే బాగుండవచ్చు. General discussion పూర్తి అయిపోయిందని మీరు చెప్పారు. కాని Procedure పూర్తి కానందువల్ల amendments ఎప్పుడైనా తీసుకుంటున్నారు. కాబట్టి దీనినింకా general discussion గానే భావించి చర్చ కొనసాగించి Voice Vote తీసుకుంటే బాగుంటుంది.

**Mr. Speaker :—If the House allows me to take its sense that the first reading is passed. Whatmore is required? Technically that procedure has been gone through. Now let us proceed with the amendments if there are any more.**

Sri N. Sivarami Reddi :—Sir, I move for the introduction of a new clause, Add at the end of cl. 2 add the following Proviso :—

"provided that till the new district boards are elected, the administration of the existing boards shall be carried on by the Special Officers with the help of District Councils constituted out of all the M. L. As. and M. Ps. of the following respective districts."

Mr. Speaker:-I want to hear The Hon. The Law Minister.

The Hon. Sri T. Viswanatham :—ఇది అమెండుమెంట్ల రూపంలో రావడం చాలాకష్టం. మిగిలిన amendments అనగా 31 మార్చి '54 అని మార్చుమనడం Sec. 76 ను ఇట్లా మారిస్తే బాగుంటుం దని చెప్పడం ఇటువంటివి సక్రమంగా వుంటాయికాని administration విషయమై ఏమివచ్చినా అది amendment క్రిందకు రాదు.

Sri N. Sivarami Reddi:—ఒకవేళ స్పెషల్ ఆఫీసర్ల గడువు కొంతకాలం పొడిగించవలసివస్తే పరిపాలన ప్రస్తుతం జరిగినట్లే బాధ్యత లేకుండాపోతుంది. అట్లాచెయ్యడంకంటెకొందరు శాసనసభాసభ్యులతోను పార్లమెంటు సభ్యులతోను జిల్లాకౌన్సిళ్ళ సహాయంతో తాత్కాలికంగా పరిపాలన సాగించడం అవసరమని భావిస్తూ ఈ amendment చాలా అవసరమనీ, దీనిని ఒప్పుకోవాలనీ, దీన్లో మీాకు irregularities లేవని మనవిచేస్తూన్నాను.

Mr. Speaker :—I feel it is irregular. It is a new clause and that it is exactly the ground on which I have overruled it.

* Sri M. Hanumantha Rao:—వీరి సవరణ బిల్లుకు సంబంధించిందవునా కాదా అనే మీమాంస వచ్చింది. మీాదృష్టికి ఒకవిషయాన్ని తీసుకువస్తాను. వెనుక ఇటువంటి బిల్లును గురించి ఆలోచించునపుడు స్పెషల్ఆఫీసర్లను వేయాలా అక్కరలేదా అనే చర్చ వచ్చినది. చాలా సవరణలు వచ్చాయి. Special Officers గా వున్న జిల్లా కలెక్టర్లకు ఎడ్వైజరీహోదాలో కొంతమంది పార్లమెంటుసభ్యులను, శాసనసభ్యులను నియమించి వారి సలహాలతో పరిపాలన జరపాలని సవరణలు ప్రతిపాదించబడి వానిమీాద చర్చలు జరిగాయి. కాబట్టి ప్రస్తుత పరిస్థితుల్లో ఈసవరణ అప్రస్తుతము క్రమవిరుద్ధము కాదని చెప్తూ దీనిని వప్పుకోవాలని కోరుతున్నారు.

22nd February 1954]

Sri Pillalamarri Venkateswarlu :— జిల్లాబోర్డులకు ఎన్నికల పొడిగింపు విషయంలో బిల్లు తీసుకు వచ్చారు. ఆ తేదీ వచ్చేటప్పటికి ఈ లోపుగా పరిపాలన ఏ విధంగా కొనసాగించాలనే విషయమై సవరణలు తీసుకురావచ్చు. Special Officer కు సహాయంగా Advisory councils యేర్పాటు చెయ్యడ మనేది దీనికి సంబంధించినదే. బిల్లులోని 2 వ క్లాజులో 'appointment of special officers to the district boards' అని కూడావుంది వాళ్లు జీవితాన్ని ఒక సంవత్సరంనుంచి మరొక సంవత్సరానికి పొడిగించాలని గవర్నమెంటుసూచన. ఈస్పెషల్ ఆఫీసరుకు సలహాయివ్వడానికి ఒకకమిటీ వుండాలనేదిఒకసూచన. దానిని ప్రభుత్వంవప్పుకోవచ్చు వప్పుకోకపోవచ్చు. దానిని వోటింగుద్వారా నిర్ణయించుకోవచ్చు. Amendment మాత్రం అప్రస్తుతంకాదు. ఈ బిల్లులోకూడ తేదీని తెలియపరిచారు. కాబట్టి Clause 2కి ఇదొక సవరణ అవుతుంది, Clause 2 లో స్పెషల్ ఆఫీసర్లు వున్నారు. వాళ్లని అట్లాగేవుంచక advisory council లాంటి ఒక తోక తగిలించమని మేమంటున్నాము. కాబట్టి ఈసవరణ సక్రమమైనదని, దానిని వప్పుకోవాలని నాకోరిక.

Mr. SPEAKER- I invite the attention of the hon. Members to Rule 96 of the Assembly Rules

'Amendments shall, unless the House otherwise decides, be considered in the order of the clauses to which they respectively relate.'

This means, an hon. Member can seek to amend any clause which has been brought in the Bill to be amended. But here the hon. Member is putting a new clause before the House.

Sri Pillalamarri Venkateswarlu : Rule 96 క్రిందకు ఇది వస్తుంది. The Government are trying to amend section 2 of the Act. ఇదికూడా ఈబిల్లుకు సంబంధించినదే Special Officers అట్లాగే వుండాలనే దానిని వప్పుకోడానికి సిద్ధంగాలేము.

Mr. Speaker :— You can defeat the Bill if you want.

Sri Pillalamarri Venkateswarlu:-- Defeat చేస్తాము లేక amend చేస్తాము. Defeat చేస్తే ప్రభుత్వం చట్టాన్ని అమలు పర్చ లేదు. ఒక amendment లో స్పెషల్ ఆఫీసర్ల గడువు 6 నెలలకు తగ్గించాలని వుంది. వారిగడువు ప్రభుత్వం కోరినవిధంగా పొడిగించ కూడదని మా వుద్దేశ్యము. దానికి amendment పెట్టాలని మా కోరిక

[Sri Pillalamarri Venkateswarlu] [22nd February 1954

వెనుక మద్రాసుప్రభుత్వానికి కూడా ఇటువంటి సవరణే యిచ్చాము. దానిని వారు **admit** చేశారు. కాబట్టి మీరుకూడా దీనిని **admit** చెయ్యవచ్చునని నాకోరిక.

**The Hon. Sri T. Viswanatham:-** ఆరోజున వచ్చిన క్లాజులో స్పెషల్ ఆఫీసర్లనియామకం మీద ప్రత్యేక సవరణ వచ్చింది ఇప్పుడు అటువంటి దేమీ లేదు. ఆపాతచట్టానికి మనంచేసే సవరణ ఒక్క తేదీని గురించి మాత్రమే శ్రీ వెంకటేశ్వర్లుగారు కూడా ఈ విషయాన్ని ఇప్పుడు తెలుసుకున్నారు. కాబట్టి ఇది సవరణ క్రిందకురాదు.

**Sri N. Sivarami Reddi** : I am now changing the form of the amendent. I move:

"At the end of clause 2, add the following :

'Provided that is the new boards are clected, the administration of the existing boards shall be carried on by the Special Officer with the help of district councils constituted out of the M. L.As. and M. Ps. of the district'

**Sri Pillalamarri Venkateswarlu** :—Sir, I second the amendment.

Mr. Speaker : The whole thing seems to be proceeding on a confusion. The Opposition is not seeking to amend the previous Act. What is the motion before the House ? The motion before the House is that the date should be changed. If any amendment is to be proposed by the Opposition or by any hon. Member, it must be an amendment to the main motion before the House and not to the original Act. I am therefore disallowing the amendment moved by Sri Sivarami Reddi.

[Sri Pillalamarri Venkateswarlu rose to speak]

Mr. Speaker : I have already disallowed the amendment I have given my ruling. The Members can change the date, but they cannot touch the other provisions of the Act.

Sri Pillalamarri Venkateswarlu :-As far as that goes, you are all right. I will go a step further.

ఇపుడు మేము ఇస్తున్న Proviso వల్ల change ఏమిటంటే **date change** చేస్తున్నాం. మేము కూడా **technical** గా **escape** కా దలచుకున్నాము. మా **viewpoint** తీసుకురావడానికి చూస్తున్నాం. **legal** గా **provisions** వున్నంతవరకు ప్రయత్నం చేస్తున్నాం. **Technical point** ద్వారానే **amendment** భాగంగా తీసుకువస్తున్నాము. ఆది **consistent** గా వుంటే మీరు **admit** చేయువచ్చును. దీనికి ఒక **proviso add** చేయడం ద్వారా **amend** చేస్తున్నాం.

proviso ఏర్పాటు చేయడం అనేది పూర్వం వుంది Special Officers కు Advisor Councils ఏర్పాటుచేయాలని అందులో చేర్చాము. ఇది order లోనే వుంటుంది అని మా ఉద్దేశం. special officers ను continue చేయడం ఆవుతుంది.

Sri G. Nagabhushanam: Sir, after the speaker has given the ruling, if an hon. Member goes on speaking...

Mr. Speaker: I am suffering it.

Sri G. Nagabushanam: Let the member have patience. I am sorry for the way in which he has been going on speaking.

Sri Pillalamarri Venkateswarlu :— నాగభూషణంగారికి కోపం తొందరలో వస్తుంది. మా position చిక్కులో వున్నమాట వాస్తవం. Clauses కు proviso లు చేరుస్తున్నామా? లేదా? అటు వంటప్పుడు ఎందుకుతీసుకురాకూడదు? మా Intention ఏమిటంటేవేరే clause పెట్టాలి అని. అది కాని పక్షంలో amendment ద్వారా proviso పెట్టాలి అని చూస్తున్నాం. Intention, spirit ఒకటే కావచ్చు అయినా proviso పెట్టడానికి అభ్యంతరం లేదు. ఈ proviso దానినుంచి different కాదు. అందుచేత ఈ provisoను amendment గా accept చేయాలి అని నాఉద్దేశం.

Mr. Speaker:— ఇప్పుడు పాత Act క్రింద స్పెషల్ ఆఫీసర్ల ప్రభుత్వం వున్నది. వారికి ఇంకొక కమిటీని తగిలించే proposal amendment కాజాలదు.

If the hon. Members want that the Special Officers should run the district boards with the advice of a sub-committee or somebody, that must come in the form of a separate Bill and not as an amendment. (Interruption from the Opposition Benches) I have already overruled it. If there are any more amendments regarding date, I will allow. Otherwise I am taking that amendments are over.

Sri Pragada Kotaiah: Sir, I move:

"For the words '31st March 1955' Substitute the words '30th the September 1954'.

The amendment was duly seconded.

Sri Pillalamarri Venkateswarlu: I think, Sir, we can now adjourn.

[22nd February 1954

Mr. Hon. SPEAKER:Members want more time and more speeches to be permitted and at the same time want me to adjourn the House by 5 P.M. I do not want to abjourn the House before 5-30 P.M. Hon. Members who want to speak may now speak.

* **Sri T. Mallayya:** General discussion లో chance వస్తుందా, లేదా అని అనుమానంగావుంది. ఇదివరలో ఎన్నో సార్లు, పేర్లు ఇచ్చినా నాపేరురాలేదు. ఈసారి అయినా నాపేరు బైటికువచ్చినందుకు తమకు కృతజ్ఞత చెప్పుకుంటున్నాను. సంవత్సరం మూడుమాసాల క్రితం రాజగోపాలాచారిగారు ప్రజాప్రతినిధులతో నడుపబడుతున్న జిల్లా జిల్లాబోర్డులను abolish చేయడానికి ఎత్తువేసి ఈబిల్లును ప్రవేశపెట్టారు. అపుడు opposition లోవున్న communist సోదరులు అందరు హోరాహోరీగా పోట్లాడి చివరకు గవర్నమెంటు పరంగా పోటీచేసినారు కాంగ్రెసుపార్టీలోవున్న వారుకొందరు freedom of vote సాకుతీసుకొని జిల్లాబోర్డులు పోతేమంచిదని, వారు అనుకున్నవారు అధికారంలో లేనందువల్ల ఆబిల్లుకు అనుకూలంగా వోటుచేసినారు. అదిజరిగింది మరల opposition వారికి ఒక సంశయం వచ్చినది. ఎన్నికలు ఎనాళ్ళు పొడిగిస్తారో అన్న అనుమానంతో బిల్లులో ఒక లేదీ పెట్టమని last moment లో amendment తెచ్చిపెట్టినారు. అప్పుడు శంకరరెడ్డిగారు Local Administration Minister గా వున్నారు. 1954 మార్చికి ఎలక్షన్లు జరగాలి అని amendment కు ఒప్పుకొని బిల్లును pass చేసినారు. అప్రుడు పరిస్థితులు అలావున్నాయండి. Partition జరిగింది. నూతనసమస్యలు ఉత్పన్నమైనాయి. ప్రధానమైనది ఆర్థికసమస్య. అది మనలను చాలా బాధిస్తోంది. గ్రామ పంచాయితీలకు ఎలక్షన్లు జరిగినాయి. ఇప్పుడు కొన్నికక్షలు బయలుదేరినాయి. ఆ కక్షలు యింకా పోలేదు. అందువల్ల ఇంతలో District Boards elections జరిగితే కక్షలు సమసిపోతవా అని నాకు సందేహంగా వున్నది. గత 4 సంవత్సరాల నుండి నేను District Board Member గా వున్నాను. ఏ వుద్దేశంతో జిల్లాబోర్డులను రద్దుచేశారు? కాంగ్రెస్ వారు పదవులలో వున్నారు కాబట్టి రద్దుకు వోటుచేశారా ? District Boards continue అయితే ప్రజాప్రతినిధులు పరిపాలనసాగించేవారు. ఇప్పుడున్న Special Officerల పరిపాలన రావడానికి మీరు తోడుపడ్డారు. ఒకవైపున elections కావాలి అంటారు. నిజంగా district board election లలో గెలుస్తారని వుద్దేశమేమో నాకు తెలియదు. పంచాయితీబోర్డు మెంబర్ల

22nd February 1954] [Sri T. Mallayya

సంఘం తయారుచేసి indirect body constitute చేసి district పరిపాలన సాగించాలని చెప్పి ప్రభుత్వంవారు నిర్ణయించి వున్నారు. నేను District board మెంబరుగా 4 సంవత్సరాలనుంచివున్నాను. బళ్ళారిలో 23 లక్షల రూపాయలు surplus వుండేది. మద్రాసు ప్రావిన్సులోని 26 District లు deficit లో వుండగా బళ్ళారి District 3 లక్షల surplus వుండని Partition committee లో వుంటుంది. ఈ surplus ఏవిధంగా distribute చేశారో మాకు తెలియలేదు. Special Officer regimeలో ఏమిజరిగిందో తెలియదు. ఆయన్ను అడిగితే కొత్తగాచార్జితీసు కొన్నాను నాకు తెలియదు అంటారు. ఈ surplus లోని ఎక్కువ ఆదాయం ఆలూరు, ఆదోని, రాయదుర్గం తాలూకాలనుండి వచ్చినవి. దీనిని మిగత 7 తాలూకాలకు ఏవిధంగా పంచుతారో తెలియదు. ఈవిధంగా District Boards abolish చేయడంవల్ల ఏర్పడిన పరిస్థితులను అనుభవిస్తున్నాం. ప్రజాప్రతినిధులు District Board పరిపాలనసాగించాలంటే elections వల్లనే అవకాశం వుంటుంది. District Board elections కు చాలా arrangements చేయాలి. Special ballot, open ballot లో ఏదివుండాలి ? Secrete ballot అనేక తమాషాలుగావుంది. మొదటివాళ్ళకుఏమిఅర్థంఅవుతుంది? నేనుస్వార్థంగా చెప్పడంలేదని మనవిచేస్తున్నాను. ఇప్పుడు శ్రీహనుమంతరావుగారు Congress ప్రభుత్వం ప్రజల మీద నిరంకుశత్వంగా ప్రవర్తిస్తుందన్నారు. వారే మరొకవైపు ప్రజలంటే యీకాంగ్రెసువారికి భయంఅంటున్నారు. నేనుమనవి చేసేది యేమిటంటే నిరంకుశత్వంగా వుండేవారు ప్రజలకుభయపడరు. కాంగ్రెసువారు ప్రజలకు భయపడతారు కాబట్టి కాంగ్రెసువారు ఎంతమాత్రము నిరంకుశులుకారు అని మనవి చేస్తున్నాను. ఏదో యీ చిన్న బిల్లు అరగంటలో అయిపోతుంది అనుకుంటే ఏవో proceedings మీద పేచీలు వచ్చాయి. నాకు నిద్రవచ్చేటట్లు అయింది. అయితేనేను నిద్రపోలేదు. యింతాచూస్తే యీబిల్లు రేపటికి వాయిదా పడుతుందేమోనని నాకు అనుమానం వేస్తున్నది. నాకు మాట్లాడటానికి అవకాశం వస్తుందో రాదో అనుకున్నాను. అవకాశం యిచ్చారు general discussion first reading second readingకలగావులగంగా యీపరిస్థితికి ఏర్పడింది ఎందుకు special officer's regime గురించి 6 నెలలకొకసారి రిపోర్టు యీ అసెంబ్లీకి పంపిస్తే వారిపరిపాలన ఏవిధంగా నడుస్తున్నదీ తెలిసిపోతుంది. 3 నెలల కొకసారి సాధ్యంకాకపోతే 6 నెలలకొకసారి రిపోర్టులు పంపిస్తే

[Sri T. Mallayya] [22nd February 1954

రెండు రిపోర్టులతో తేలిపోతుంది. మాట్లాడితే కాంగ్రెసు ప్రభుత్వాన్ని తిట్టడం పరిపాటయిపోయింది. Opposition వారికి opposition ను support చేయడం అంటే తిట్లను support చెయ్యడమా ? ఇది healthy opposition అని అనుకోవాలా unhealthy opposition అని అనుకోవాలా ?

Mr. Speaker :— This is all irrelevant and not pertaining to the Bill that is before the House. That is why he was not getting chances previously. (Laughter)

Sri T. Mallayya :— (was seen standing.)

Mr. Speaker :—The hon. Member will please take his seat.

Sri K. Rajagopala Rao :—On a point of order, Sir.
తమరు irrelevant speech అన్నారు. అదియదార్థం. అంతేకాకుండా, యీ గౌరవసభ్యుడు తనప్రసంగంలో సభను అమర్యాదచేసే విషయాలను కూడ ప్రస్తావించారని తమ దృష్టికి తీసుకువస్తున్నాను. ప్రభుత్వాన్ని ప్రతిపక్షం తిట్టిందని ఆయన అంటున్నారు. విమర్శను నిందగా భావించి అభాండంవేయడం అసందర్భముగా వున్నది. అక్రమమైనటువంటిది. తగినచర్య తీసుకుంటారని ఆశిస్తున్నాను. సభ్యులు చర్చలుచేస్తే నిద్ర వస్తున్నది అని ఆయన మరొకమాట అన్నారు. ఆరోపించారు. అది సభయొక్క గౌరవానికి, మర్యాదకు భంగకరం. తమరు ruling ఇచ్చిన తరువాత సభలోని చర్చలన్నీ కలగాపులకంగా వున్నాయని యింకొకటి అన్నారు. తమరు ఒక ఆర్డరులో నడుపుతున్న చర్చలపై యీ లాంటి వ్యాఖ్యానాలు చేయడం సభవారిని, అధ్యక్షస్థానాన్ని కించపరచటం అవుతున్నది. కాబట్టి అధ్యక్షులు మందలించవలసిందిగా కోరుతున్నాను.

Mr. Speaker :—Hon. Members seem to be feeling tired. I adjourn the House to meet again at 2. 30 P. M. tomorrow. The House will sit till 7 -30 P. M.

The House then adjourned.

## APPENDIX I.

# PAPER LAID ON THE TABLE OF THE HOUSE.

[*Vide* STARRED QUESTION No. 118 ASKED BY SRI S. NARAYANAPPA, M.L.A. AT THE MEETING OF THE LEGISLATURE ASSEMBLY HELD ON 22ND FEBRUARY, 1954 AT PAGE 8 SUPRA]

STATEMENT I.

STATEMENT SHOWING THE STOCK OF FOODGRAINS IN EACH CENTRE IN ANANTAPUR DISTRICT.

| Name of centre. (1) | Rice. (2) TONS. | Wheat. (3) TONS. | Millets (4) TONS. | Broken rice. (5) TONS. |
|---|---|---|---|---|
| 1 Guntakal .. .. | 745 | 242 | 60 | .. |
| 2 Tadipatri .. .. | 124 | 50 | 7 | 32 |
| 3 Anantapur .. .. | 94 | 93 | 96 | .. |
| 4 Hindupur .. .. | 15 | 139 | 19 | .. |
| 5 Penukonda .. .. | .. | 98 | 30 | 20 |
| 6 Dharmavaram .. | .. | 85 | 22 | 2½ |
| 7 Kadiri .. .. | .. | 224 | 154 | 116 |
| Total .. | 978 | 931 | 388 | 170½ |

STATEMENT II.

STATEMENT SHOWING THE MONTHLY EXPENDITURE AT EACH RECEPTION CENTRE IN ANANTAPUR DISTRICT.

| Name of centre. (1) | March, 1953. (2) Rs. | A. | P. | April, 1953. (3) Rs. | A. | P. | May, 1953. (4) Rs. | A. | P. | June, 1953. (6) Rs. | A. | P. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 Guntakal .. | 220 | 0 | 0 | 1,218 | 8 | 0 | 681 | 3 | 0 | 610 | 4 | 0 |
| 2 Tadpatri .. | 190 | 0 | 0 | 653 | 2 | 0 | 2,674 | 4 | 0 | 816 | 7 | 0 |
| 3 Anantapur .. | .. | | | 7 | 9 | 0 | 263 | 7 | 0 | 675 | 14 | 2 |
| 4 Hindupur .. | .. | | | .. | | | .. | | | 60 | 0 | 0 |

| Name of centre. | July, 1953. (6) Rs. | A. | P. | August, 1953. (7) Rs. | A. | P. | September, 1953. (8) Rs. | A. | P. |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 Guntakal .. | 967 | 5 | 0 | 1,140 | 5 | 0 | 240 | 0 | 0 |
| 2 Tadpatri .. | 441 | 12 | 0 | 1,375 | 5 | 0 | 1,088 | 8 | 0 |
| 3 Anantapur .. | 680 | 4 | 2 | 933 | 13 | 1 | 302 | 0 | 0 |
| 4 Hindupur .. | 60 | 0 | 0 | 60 | 0 | 0 | 60 | 0 | 0 |

*Remarks*:—No expenditure incurred for the remaining centres so far.

M. SREERAMULU,
*Assistant Secretary to Government.*

## APPENDIX II.

*A Bill to amend the Madras District Boards (Amendment Act, 1953.)*

WHEREAS it is expedient to amend the Madras District Boards (Amendment) Act, 1953 (Madras Act V of 1953), for the purpose hereinafter appearing; it is hereby enacted as follows :-

1. *Short title:*—This Act my be called the Madras District Boards (Amendment) Andhra Amendment Act, 1954.

2. *Amendments of section 1 of Madras Act V of 1953:*—In section 1, sub-section (2), of the Madras District Boards (Amendment) Act, 1953 (Madras Act V of 1953), for the figures, letters and word "31st March 1954", the figures, letters and word "31st March 1955" shall be substituted.

### STATEMENT OF OBJECTS AND REASONS.

Under the Madras District Boards (Amendment) Act, 1953 (Madras Act V of 1953), Special Officers have been appointed to all the district boards from the date of expiry of the term of office of the members of the district boards and Government have to cause elections to be held to the district boards. The Act will cease to have any effect after the 31st March 1954. It is not possible to arrange for the roconstitution of the district boards on the basis of the universal adule sufferage. Secondly, the district boards' financial position has become so bad that Government or obliged to come to their aid to enable them to run their administration. Government have examined thr question whether it is worthwhile to retain district boards with theil inability to undertake any scheme for the improvement of the rura areas or the provision of amenities therein and have come to the conclusion that it is necessary to abolish them. As this requires examination as to what should be done to wind up their administration how to arrange for the discharge of their liabilities and what alternative agencies should run the institutions now under district board management, it is considered necessary to continue the existing arrangements by extending the life of the Act up to 31st March 1955. The Bill makes the necessary provision for this limited purpose.

P. TIMMA REDDY,
*Minister-in-charge of Local Administration and Agriculture.*

(By order of the Governor)

M. K. NARAYANASWAMI,
*Deputy Secretary to Government, Law Department.*

PRINTED AT THE PATTABHI RAMA PRESS, ELURU